# పరివర్తన

(నాలుగు ఏకాంకికలు) 141/3-84.

(స్త్రీలకు ప్రత్యేకము)




రచన :

డా॥ వాసా ప్రభావతి ఎం.ఎ. పి.హెచ్.డి

లెక్చరర్

సరోజినీ నాయుడు వనితా మహా విద్యాలయ

హైదరాబాదు



వాసా ప్రచురణలు,

మలక్‌పేట, హైదరాబాదు.

# పరివర్తన

నాలుగు ఏకాంకికలు



రచన :
డా॥ వాసా ప్రభావతి

ప్రథమ ముద్రణ
ఆగస్టు 88

ముఖచిత్రం : శీలా వీర్రాజు
కవర్ పేజీ & పుస్తక ముద్రణ : ఉదయ ఎంటర్‌ప్రైజెస్

ప్రతులకు :
వాసా ప్రచురణలు
11/2RT, మ్యునిసిపల్ కాలనీ,
మలక్‌పేట, హైదరాబాదు-500 036.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజారు, హైదరాబాదు.

వెల రూ. 10/-

## కానుక

దేశ భక్తులు, స్వాతంత్రసమరయోధులు,

సాహితీప్రియులు, సహృదయులు,

కార్యాచరణ దక్షులు, త్యాగరూపులు

సుహృద్భాషులు, స్నేహపాత్రులు

అయిన

శ్రీ త్రిపురాన రాఘవదాసు గారికి

ఈ పరివర్తనను

కానుకగా

సమర్పిస్తున్నాను.



డా॥ వాసా ప్రభావతి

# కృ త జ్ఞ త లు

నేటి సమాజంలో ఎన్నో కొత్తసమస్యలు తలెత్తుతున్నాయి. ఆ సమస్యలే ఈ ఏకాంకికలలో కథావస్తువులు. ఇవి ఎవరిని నిర్దేసించి వ్రాసినవి కావు.

ఇవి కేవలము విద్యార్థినులకొరకు వ్రాయబడినవి. ఇంటర్ కాలేజీ పోటీలలో బహుమతులు కూడా సంపాదించుకున్నాయి.

నా అభిమానుల ప్రోత్సాహంవల్ల ఈ ఏకాంకికలు నేటికి ఈ రూపాన్ని సంతరించుకున్నాయి.

ఈ 'పరివర్తన'ను కాకకగా స్వీకరించడానికి అంగీకరించిన శ్రీ త్రిపురాన రాఘవదాసు గారికి (ఎక్స్-ఎమ్.ఎల్.సి.), తమ అమూల్యాభిప్రాయాన్ని వ్రాసియిచ్చిన శ్రీ జె. వి. సోమయాజులు గారికి, సముచితమైన కవరుపేజి వేసియిచ్చిన శ్రీ శీలా వీర్రాజుగారికి, సకాలంలో ముద్రించి యిచ్చిన ఉదయ ఎంటర్‌ప్రైజస్‌వారికి; నా మిత్రులకు, నా శ్రేయోభిలాషులకు, సహృదయులకు అందరికి నాకృతజ్ఞతలు అందజేస్తున్నాను.

డా॥ వాసా ప్రభావతి

# అ భి నం ద న

డా॥ వాసా ప్రభావతిగారు వ్రాసిన నాల్గు నాటికలు చదివేను. ముఖ్యంగా యీ నాటికలు బాలికలు (విద్యార్థినులు) చదివే పాఠశాలలు, కళాశాలల్లో ప్రదర్శించాలన్న ఉద్దేశ్యంతో వ్రాసినట్లు కన్పడుతూంది. యిందుకు కారణం యీ నాటికలన్నింటిలో స్త్రీ పాత్రలు ఎక్కువ, పురుష పాత్రలు నామమాత్రం.

ప్రదర్శన కాలం అరగంటకు మీరదు. రంగస్థలంపై పరికరాలు కూడా సులభంగా ఏర్పాటు చేసుకోవచ్చు. అందుచేత నాటికలన్నీ ప్రదర్శనకు అనువుగా వున్నాయి.

నాలుగు నాటికల్లోనూ చక్కటి సమస్యలు ఎంపిక చేశారు. మన ఆచారాలు. సంప్రదాయాలు మనకి ఎప్పుడూ శిరోధార్యాలే. అయినప్పటికి, మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా వాటిని అర్థం చేసుకొని సమస్యన్ని అధిగమించడంలో నేటి యువతరం స్వతంత్రంగా మంచి నిర్ణయాలు తీసుకోగలరు అన్న ఆశాభావాన్ని యీ నాటికలు కలుగజేస్తున్నాయి. యిందుకు డా॥ ప్రభావతిగార్ని అభినందిస్తున్నాను.

"పరివర్తన" నాటిక ముఖ్యంగా యీనాటి యువతరాన్ని పీడిస్తున్న పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి మంచి జవాబు చెప్తుంది. ప్రదర్శనాపరంగా కూడా యీ నాటిక అన్నింటిలోకి బక్కగా వుంటుందని చెప్పవచ్చు.

"ఇదే మనకర్తవ్యం" నాటికలో గ్రామరాజకీయాలలో స్త్రీలు నిర్వహించవలసిన భాధ్యతలు చక్కగా చిత్రీకరించేరు.

"మీరూ మీరూ ఒక్కటే" నాటికలో "రత్తి" పాత్ర విచిత్రంగా వుంది. కుటుంబంలో ఎంత చదువువున్నా రత్తిలాంటి పాత్ర నాటికలో రాసినట్లు ప్రవర్తించడం చాలా కష్టమేమో చిన్నమార్పుచేసికొని, కొన్ని మాటలు "స్వగతం"లో చెప్పిస్తే మరింత బాగుంటుంది.

"తరం మారింది" హాస్యధోరణిలో చక్కగావుంది.

పూర్వం శ్రీ మల్లాది విశ్వనాధ కవిరాజుగారూ, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారూ విద్యార్థుల కుపయుక్తంగా హాస్యధోరణిలో చక్కని చిన్న నాటికలువ్రాసి అందించేరు. డా॥ వాసా ప్రభావతిగారు యిప్పుడు మళ్ళా అటువంటి ప్రయత్నానికి పూనుకున్నందుకు ఆమెను అభినందిస్తున్నాను.

- డా॥ జె. వి. సోమయాజులు

# పరివర్తన

## (ఏకాంకిక)

ప్రతి యుగంలోను నాగరికతతోపాటు సంస్కారం పెరుగుతూనే వుంటుంది. కాని కొంతమంది కేవలము అత్యాధునికమైన వేషభాషలలో హాయిగా తిరగడమే సంస్కార మనుకుంటున్నారు. పాత సాంప్రదాయాలను తిరస్కరించడమే సంస్కార మనుకుంటున్నారు. అటువంటి ప్రవృత్తిగల జానకిలో పరివర్తన కలగడమే ఇందు కనబడుతుంది,

జానకి పై చదువులకోసం అమెరికా వెడుతుంది. పాత రోత అన్నట్టుగా పాత సాంప్రదాయాలమీద ద్వేషం పెంచుకుని కేవలము అత్యాధునిక వేష భాషలమీద మోజు పెంచుకుంటుంది. చనువుగా తిరుగుతున్న Mr. Tarch ని ప్రేమించా ననుకుంటుంది. అతను ఇండియాచూడాలని వస్తుంటే చదువుమానేసి అతనితోపాటు తిరిగివస్తుంది. జానకి అక్కగారైన రాధ పద్ధతులను, ఆమె స్వభావాన్ని గ్రహించిన Mr. Tarch ఎంతగానో సంతోషించి జానకిని మందలిస్తాడు. పెళ్ళిచేసుకుని హాయిగా తిరుగుదా మన్న జానకిని తిరస్కరిస్తాడు. తన ప్రవర్తనకు సిగ్గుపడిన జానకిలో పరివర్తన కలుగుతుంది.

ఇదే పరివర్తన నాటిక.

# పరివర్తన

రచన : డా॥ వాసా ప్రభావతి

(ఏకాంకిక)

పాత్రలు : 1. తల్లి (సుమారు 45-50 సం॥ మధ్య వయస్సు)
2. వనిమనిషి సుబ్బి (సుమారు 25 సం॥)
3. అక్క - రాధ (25 సం॥)
4. బామ్మ (70-75 సం॥)
5. జానకి (22 సం॥ మోడరన్ డ్రస్)
6. స్నేహితురాలు - పింకీ (22 సం॥)
7. మిస్టర్ టార్చి (25 సం॥ ఫారిన్ డ్రస్‌లో)

## ( ర ం గ ము )

(సుబ్బి డ్రాయింగు రూములో కుర్చీలు అవి సర్దుతూఉంటుంది ఇంతలో తల్లి ప్రవేశము)

తల్లి :- ఒసే సుబ్బీ ! అన్నీ ఆరేంజి చేసేశావా ! బేబివచ్చే టైం అయిందే ! బేబివచ్చే టైం అయింది. అకుర్చీలు అలాగే వుంచడం ? ఆటీపా అక్కడే పెట్టడం ? అయ్యో ఖర్మే - నీతో ఛస్తున్నానే (కుర్చీలు సర్దతూవుంటుంది.)

సుబ్బి :- అన్నీ సర్దేశానమ్మా !

తల్లి :- ఆ - ఆ ఒసే సుబ్బీ - అమ్మా ! గిమ్మా ! అనవద్దని నీకెన్నిసార్లు చెప్పానే ఫారిన్‌నుంచి అమ్మాయి వస్తోందని ఆరు నెలలనుంచి ట్రైనింగు ఇస్తున్నా. ఏమిలాభం లేదే. నీతో నిజంగా బోరెత్తి పోతోందనుకో. చక్కగా, 'ఎస్. మేడమ్' అని అనాలని చెప్పానాలేదా ? అలా పల్లెటూరి అమ్మలక్కలా. మాట్లాడితె ఎలాగె. ఈమాటు మళ్ళీ అమ్మా అన్నావంటె నీనాలుక చీల్చేస్తా చూసుకో.

సుబ్బి :- ఓయబ్బో ! అవన్నీ మాకేటి తెలుస్తాయమ్మా ? అయినా 'మాడమ్మా' అంటే ఏటిబాగున్నదండీ.

తల్లి :- అయ్యో ! అయ్యో. ఇదెక్కడి ఖర్మే. నన్ను పిచ్చిదాన్ని చేసేస్తున్నావూ ?

సుబ్బి :- సిత్తం. సిత్తం 'మీరేది సేసెయ్యమంటే ఆదే సేసెస్తానమ్మా'

తల్లి :- ఓసి మొద్దు మొఖమానీ. ఆమ్మా. గిమ్మా అనవద్దని ఇప్పుడేకదా చెప్పాను ? ఏది ఇలారా ! ఇలావచ్చి నుంచో.

(సుబ్బి ఎదురుగావచ్చి నిలబడవలెను).

ఏస్ మేడమ్ అని అనవే.

సుబ్బి :- నాకెట్టా వొస్తదండీ.

తల్లి :- అసూ ! ఫరవాలేదు. అదే వొస్తుంది. ఊ.

సుబ్బి :- ఏది సెప్పండి.

తల్లి :- ఏస్ మేడమ్.

ముబ్బి:- యస్సొ - మాడమ్మా.

తల్లి :- మళ్ళీ, చెప్పు ఎస్. మేడమ్.

ముబ్బి :- యస్సొ - మాడ్ - అమ్మా.

తల్లి :- ఓసినీ - నువ్వెక్కడ దొరికా వేనాకు.

ముబ్బి :- ఏడ దొరికద వేంటండీ - మాయమ్మే మీకాడ పెట్టినాదండి.

తల్లి :- ఏంచేస్తాను ఋణాలబంధమే. అది సరేకాని ఇంతకీ హాట్ వాటరు అవి రెడీగా ఉంచావా ? బేబీరాగానే బాత్ చేస్తుందే బాత్ చేస్తుంది. తెలిసిందా !

ముబ్బి :- ఏటోనండి. ఆ హాట్లుయాట్లు మాకేటి తెలుస్తాయిండి - అయినా మాడమ్మా ఇంతకీ నాకు తెలీకడుగుతానండి అమ్మాయిగోరు బాతులతో ఏం చేస్తారండి ?

తల్లి :- ఓసి రాస్కెల్ ? నీదివొట్టి మంకీబుర్రే. మా డాటర్ వచ్చిందంటే వెంటనే నిన్ను డిస్ మిస్‌చేసి ఫారిన్‌నుంచే పనివాళ్ళను తెచ్చుకుంటుంది తెలిసిందా ?

ముబ్బి :- ఏటోనండి ఫారినంటే మాకేటి తెలుస్తాదండి, అయినా మాడమ్మగోరు యీడ పెద్ద పేద్ద సదువులు సదివినోళ్ళకే ఆడ ఉద్యోగాలు దొరక్క అడ్డమైన పనులు సేస్తారుటండి అసలు పనిమనుషులే లేరుటండి. మగోరే ఒంటకూడా సేసేసు కుంటారుటండి

తల్లి :- ఓసి రాస్కెల్ - నోరు మూసుకోవే అయినా అవన్నీ నీకెవరు చెప్పారే ? పెద్ద ఫారినెళ్ళి చూసొచ్చినట్లే మాట్లాడుతున్నావు ?

ముబ్బి :- ఏరు సెప్పడ మేటండి. మాపక్కింటి బాబుగారె సెప్పినారండి. ఆరికి ఈడ ఏవుద్యోగం దొరకలేదటండి. ఇసుగెత్తి సీమకెళ్ళి పొయినారటండి, ఆడా ఏది దొరకలేదటండి. ఇంకా యిసుగెత్తి పొయినారటండి యెంటనే ఓరింట్లో ఒంటాయనగా సేరిపొయినారండి పాపం ఆరికి ఎంతకష్ట మొచ్చిందో నండి. (ఏడుపు గొంతుక పెట్టవలెను అవిడకు కొంచెం దగ్గరగావచ్చి) ఇంతకీ మనమ్మాయిగోరు ఆడ ఏం సేస్తున్నట్టండీ.

తల్లి :- అది వాడిఖర్మే అందరు అలాగె ఉంటారనుకుంటున్నావ్వేమిటి. మనమ్మాయి ఎవ్వరు చదవని చదువు చదువుతోందే ! బేబీ అంటే ఏమనుకుంటున్నావు. అయినా ఒసేసుబ్బీ మనకు తెలుసున్న వాళ్ళంతా మనమ్మాయినిగూర్చి గొప్పగా చెప్పుకుంటున్నారా లేదా ?

సుబ్బి :- గొప్పో బీదో నాకు తెల్దుకానీండి అమ్మాయిగోరికి శానా గర్వంటండి ఆరికి మీపోలికే వచ్చినాదిటండి.

తల్లి :- ఆ ! - ఆ - ఎంత లేపిమాట లంటున్నారే ? ఇంకా ఏమన్నారే ?

సుబ్బి :- ఏమంద మేటండి. పెద్దమ్మాయిగోరు శానా మంచోరుటండి. ఆరు నాయనమ్మగోరి పోలికటండీ. చిన్నమ్మగోరుకాస్త జాగ్రత్తగా ఉండాలండి - ఎలాగో ఏటోనండి ?

తల్లి :- ఏమి చేమిటి నాచిన్న దాటర్ని గురించి ఆలా చెప్పుకుంటున్నారా ! మనబేబీ పెద్ద చదువు చదువుతోందని కాస్త ఫేషన్‌గా ఉంటుందని వాళ్ళకి గిట్టదు. అయినా ఇదంతా వాళ్ళ నాయనమ్మే చెప్పి ఉంటుందే. ఛీ ! ఛీ ! ఆచాదస్తపు మనుష్యులతో మనకేంపనే.

సుబ్బి :- అంతేలెండి - మనకేటి పనండి. ఏదో మీరడిగారు గందా అని సెప్పినానండి. లేకపోతే నాకేటిపనండి మాదమ్మగోరూ !

తల్లి :- ఎంతచెప్పిన మళ్ళీ అదేమాటచే

(ఇంతలో పెద్దకూతురు రాధ ప్రవేశం)

రాధ :- హా - హా- ఆహా - (పెద్దనవ్వు.)

సుబ్బి :- ఏటోనండి రాధమ్మగోరు మీరలా నవుతూవుంటె నాకేటి అర్థం కాడంలేదండి.

రాధ :- హా ! హా ! హా ! (మళ్ళా నవ్వు)

తల్లి :- (కాస్త చికాగ్గా) ఏమిటేరాధా ఆనవ్వు - ఇంతకీ ఆంత నవ్వేందుకొస్తోందే ?

రాధ :- (కాస్త నవ్వు తగ్గించి) అది కాదమ్మా - సుబ్బి మాదమ్మా అంటే నవ్వొస్తోందే - ఒసే సుబ్బీ - నీకెవరు చెప్పేరే ఆలా అనమని ?

సుబ్బి :- అమ్మగారె సెప్పినారండి. ఆ ఇంగ్లీపీసు నాకు నోటంట రాట్లేదని మొత్తుకున్నా ఒదలట్లేదండి. నా బుర్ర యేడెక్కిపోతున్నదంటే నమ్మండి.

రాధ :- అమ్మా ! నువ్వేదో నాలుగు ఇంగ్లీషుమాటలు మాట్లాడితే బాగానెఉంది కాని ఆ నోరుతిరగని పనిమనిషికెందుకమ్మా ! నోరుతిరక్కా అది ఎలా పలుకుతోందో చూశావా ?

తల్లి :- నేనేం చేశాననే ఆలా అంటావు ? ఇంతకీ నేను చదువుకోని దాన్నని ఇంగ్లీషు రానిదాన్ననేగా నీ ఉద్దేశ్యం.

రాధ :- అమ్మా! నేననేది అదికాదు. ఇంగ్లీషుముక్కలు మాట్లాడితేనే ఫేషనను కోడం తప్పంటున్నానంతే.

తల్లి :- ఫేషనుకేముందే. చదువుకున్నవాళ్ళే ఇంగ్లీషు మాట్లాడాలా ఏమిటీ. అయినా అదికూడా మనలాగె ఇంగ్లీషు మాట్లాడితే తప్పేమిటి? ఏదైనా నేర్చుకోందే ఎలావస్తుందే.

రాధ :- తెలుగుమాట్లాడ్డమే దానికి సరిగారాదు. ఇంకా ఇంగ్లీషెందుకు దానికి. అయినా ఈ హడావిడంతా దేనికమ్మా? ఇప్పుడు.

తల్లి :- అదేమిటే రాధా! అలా అంటావు? ఇన్నాళ్లికి విదేశాలనుండి పిల్ల తిరిగొస్తుంటే తల్లి హడావిడి పడటంలో తప్పేముందే.

రాధ :- తప్పని కాదమ్మా ఈ రోజుల్లో అందరు ఫారిన్ వెళ్ళొస్తున్నారు. అయినా జానకి చదువు మధ్యలోఆపి ఇండియా తిరిగివస్తుంటే ఈ ఆర్భాటం దేని కంటున్నానంతే.

తల్లి :- అమ్మా! రాధా! నీతో వాదనచేసేశక్తి నాకులేదు. అయినా నే నేం చేశాననే. కాస్త ఇల్లు సర్దించాను అంతేగా. అయినా అదివస్తే దాని ఫ్రెండ్సు ఎంతో మందివస్తారు. పైగా బేబీతో పాటినబ్బాయికూడా వస్తున్నాడుగా. అయినా నీకేంతెలుసే ఆ ఫేషనులన్నీను నీదంతా ఆ బామ్మ ట్రైనింగే.

రాధ :- పోనీలే అమ్మా! నాదేదో పూర్వకాలం ట్రైనింగు. నీ ఫేషన్ల పిల్ల వస్తోందిగా ముచ్చటలన్నీ తీర్చుకుందువుగాని. సరే కాస్తనాకు పనుంది. నా ఫ్రెండింటి వరకు వెళ్ళొస్తాను.

తల్లి :- సరే కాస్త త్వరగా రా యింటికి (ఇల్లు ఆఖరిసారిగా సర్దును).

రాధ: ఇప్పుడే పది నిమిషాల్లో వచ్చేస్తాను.

(రాధ వెళ్ళును. సుబ్బి హడావిడిగా ప్రవేశం)

సుబ్బి : అమ్మగోరండీ! అమ్మగోరండీ! ఆ కాదండి—మాదమ్మగోరండీ! మాదమ్మ గోరండీ : మనింటికెవరో వస్తున్నారండి. ఆరుబలేగా ఉన్నారండి.

తల్లి : ఆ- మన బేబీయే అయిఉంటుందే. కాస్త సరిగాచూసి యేడవ్వే?

సుబ్బి : సరిగానేచూసి యేడిసినానండి. ఆరచ్చు అబ్బాయిగోర్లా ఉన్నారండి.

తల్లి : ఏడిశావులేవే వెర్రివాగుడూ నువ్వూను అదిగో బేబీయే. హల్లోబేబీ.

జానీ :- హల్లోమమ్మీ (అంటూ కౌగలించుకొని ముద్దు పెట్టుకొనును.)

తల్లి :- నా బేబీ వచ్చేశావా ! మై స్వీట్‌గరల్ వచ్చేశావా. నీకోసం చూసిచూసి నాకళ్ళు కాయలు కాసేయనుకో అదేమిటే అలా చిక్కిపోయావు ?

బేబీ :- చిక్కలేదు మమ్మీ : నీకళ్ళకలా కనబడుతున్నా అంతే. 'అయామ్ ఆల్ రైట్'.

తల్లి :- ఇలాకూర్చో బేబీ (పక్కన కూర్చో పెట్టుకొనును). మేమంతా ఏర్ పోర్టుకి ఒద్దా మనుకున్నాం. టైం కాకుండానె వచ్చేశావేమే.

జానీ :- లేదమ్మా ముందు ప్లేన్‌లో వచ్చేశాం. నాఫ్రెండ్ మిస్టర్ టార్చి కూడా వచ్చాడు.

తల్లి :- అత నెక్కడున్నాడే.

జానీ :- హోటల్లో దిగాడమ్మా ? తర్వాత వస్తానన్నాడు మనింటికి.

సుబ్బి :- ఏటో ఇదంతా ! సాన సిత్రంగా మారిపోయారే ?

తల్లి :- ఓసి చచ్చుబుర్రా ! నీకింకా తెలీలేదుటే ! చిన్న బేబీగారె మనచిన్న బేబీగారు.

సుబ్బి :- ఆ - ఆ - ఆట్టాగండి. నాకట్టా అనిపించడంలేదండి. ఏటోలా మారిపోయినా రండి - బారెడు జడతో బంగారు బొమ్మలాగుండే ఓరండి. ఇదేటండి యీ యేసం.

తల్లి :- ఓసి రాస్కెల్. అవన్నీ నీకెందుకే అయినా ఇంకా అలా దాల్లానుంచున్న వేమిటే కాఫీ పట్టుకురా క్విక్ - క్విక్.

సుబ్బి :- సిత్తం - సిత్తం. సిటికెలో పట్టుకొచ్చేస్తాను మాదమ్మగోరు. (అని లోపలికి పరుగెత్తును.)

బేబీ :- అదేమిటమ్మా - 'మేడ్ అమ్మా' అంటోంది: (నవ్వు -)

తల్లి :- ఆ - దానినెత్తి - 'మేడమ్' అనడం చేతకాక ఈ పాట్లన్నీను.

బేబీ :- అదా సంగతి. బలేగా అంటోందే. (హా - హా - హా నవ్వు)

సుబ్బి :- (తిరిగివచ్చి) ఇవిగోనండి కాఫీలు.

తల్లి :- జానకీ ముందు కాఫీతీసుకో.

విసీ :- మమ్మీ - నేను పేరు మార్చుకున్నా ఫారిన్‌లో అందరు ఇప్పుడునన్ను 'జానీ' అని పిలుస్తున్నారు.

తల్లి - అలాగా చెప్పవేంమరి. బాగా మార్చుకున్నావే. 'జానీ' అంటె సింపుల్‌గాను

ఎంతో ఫేషన్‌గాను కూడా వుంది.

జానీ :- అంత బాగుందా మమ్మీ ! నీకు నచ్చుతుందని అప్పుడే అనుకున్నా.

తల్లి :- ఆహా ఏమిటీవి ఏం బ్యూటీయేనీకు ఈవూళ్ళో ఇంతమంది ఉన్నారుగాని నీలా ఒక్కరు అందంగా ఫేషన్‌గా లేరంటేనమ్మ. ఇప్పుడు నువ్వచ్చు ఫారిన్ గరల్‌లా ఉన్నావే.

జానీ :- మమ్మీ నాకసలు ఈ ఇండియా అంటేనేబోరు ఆరోడ్లుచూడు అంతా దర్టీయే. కాలు కిందపెట్టాలంటేనే భయం ఇక మనుష్యులంటావా అసలు వాళ్ళకి మానర్స్ తెలియవు. నేనొస్తూంటే ఒక వింతజంతువును చూసినట్లే చూశారనుకో !

తల్లి :- చూడకేం చేస్తారు. అసలు ఫేషన్‌సంగతి ఆ మొహాలకేం తెలుసునని కాస్త ఫేషన్‌గా కనబడితేచాలు గుడ్లు మిటకరించిచూస్తారు. అందుకనే గొప్ప గొప్ప వాళ్ళంతా ఫారిన్ వెళ్ళిపోతున్నారు. అయినా ఆమొద్దు మొహాలసంగతి మన కెందుకులే.

జానీ :- కరక్టు మమ్మీ - కరక్టు - అందుకే నేను కూడా అక్కడే సెటిలయిపోయి నిన్ను కూడా తీసుకెళ్ళిపోదామను కుంటున్నాను.

తల్లి :- నాబేబీయే - నాబేబీయే - (కూతుర్ని ముద్దు పెట్టుకుంటుంది.) అయినా జానీ ఈబాగ్ - ఈహేర్ ఈడ్రెస్ - నీకెంత బాగున్నాయే. మీఅక్కా వెళ్ళొచ్చింది చూడు. ఒక్క ఫేషన్ నేర్చుకోలేదు. నిజంగా నువ్వు నాపేరు నిలబెట్టావే.

జానీ :- అయినా అసలు ఈ ఇండియన్స్ ఈజన్మలో మారరు మమ్మీ. ఆ జాకెట్లు - ఆ జడలు ఎక్కడో బి. సి నాటి మనుష్యులు. అందుకే వాళ్ళతో మాట్లాడాలంటేనే బోరు. నాఫ్రెండ్ పింకీకి నేనొస్తున్నట్లు లెటర్ రాశానమ్మా ! ఇంకా రాలే దెందుకనో.

తల్లి :- నేనుకూడ కబురుచేసేను ఈపాటికి వస్తూనె ఉంటుంది.

(త్వరలో జానీ ! జానీ !)

తల్లి :- అదుగో పింకీ మాటలోవచ్చింది. రా పింకీ ! రా.

(పింకీ లోపలి కొచ్చును).

జానీ :- హాయ్, పింకీ - హాయ్.

పింకీ :- హాయ్ జానీ - హాయ్ - (ఇద్దరు కరచాలనం)

జానీ :- హాయ్ పింకీ - నీకోసమే ఎదురు చూస్తున్నా

పింకీ :- ఎప్పుడొచ్చావే.

జానీ :- ఇప్పుడే ఒచ్చాను ఇంతలో నువ్వు రానేఒచ్చావు.

తల్లి :- జానీ! మీరు మాట్లాడుతూ ఉండండి. నేను లోపలికెళ్ళి పనిచూసుకుంటూను. ఒసే సుబ్బీ లోపలికెళ్ళి కాస్త కాఫీపట్టుకు ఏడవ్వే.

సుబ్బి :- (బయటకొచ్చి) ఓయబ్బో ఏటండి - ఏడవమంటారు. ఏడుస్తూ - ఏడుస్తూ, ఉన్నానండి ఇవిగోనండి కాఫీలు (కాఫీకప్పులు అందిచ్చును).

తల్లి :- కాఫీలు తాగండి - (లోపలికెళ్ళును)

పింకా :- జానీ - హాయిగా ఫారిన్అంతా తిరుగొచ్చావు. అక్కడ నీకెలా అని పించిందే.

జానీ :- ఎలా అనిపించడమేమిటే. అక్కడెంత హాపీగా ఉండొచ్చనీ.

పింకీ :- అలాగా - మవ్వనిబంగా లక్కీ-ఫెలోవేనే నువ్వుకనక ఫారిన్ వెళ్ళకలిగావు. నేనుచూడు ఎలా ఉండిపోయానో. నువ్వు అంతగా అక్కడ ఎంజాయ్ చేస్తూంటే ఇక్కడ గుమ్మం కదిలితేనేతప్పు. ఇక ఏఅబ్బాయితో నైనా మాట్లా దేమో చచ్చామె అనుకో. ఉన్నవి లేనివి కల్పించి ఊరంతా చాటించేస్తారు,

జానీ :- పింకీ! ఇక్కడ తెలియని విషయాలు నాకేమున్నాయని. అందుకే నేను ఫారిన్లోనె సెటిల్ అవ్వాలనుకుంటున్నా.

పింకీ :- అలాగా అబ్బా - ఎంత అదృష్టమే.

జానీ :- అదృష్టంకాక మరేమిటే - ఇక్కడ నేను ఒక్కరోజుండలేనే. అక్కడ మనకు నచ్చినవారితో స్వేచ్ఛగా తిరగొచ్చు కావలసినవాణ్ణి కట్టుకోవచ్చు. ఇక్కడలా అడ్డుపెట్టేవారులేరు. పైగా వాడునచ్చకపోతే విడాకులిచ్చి ఇంకొకరిని పెళ్ళి చేసుకోవచ్చు.

పింకీ :- ఎంత ఎడ్వాన్సు దేశాలేఅవి. ఇక్కడచూడు కట్టుకున్నవాడు బాధలు పెట్టిన. తిండిపెట్టక ఏడ్పించిన చచ్చినట్లు జీవితాంతం వాడితోనె బాధలుపడుతూ ఉండాలి. ఇదెంత అన్యాయం ఎవరు గమనించేవాళ్ళు లేరు.

జానీ :- అందుకే పింకీ- మనకవన్నీ సంపదనే అందుకే ఫాషనే మనకన్ని ఫాం తగింది.

పింకీ :- జానీ ! నువ్వయితే ఫాషన్ వెళ్ళగలిగావు. కాని అందరువెళ్ళగలరా. అందుకే అసలు యీ ఇండియన్ సిష్టాన్నే మార్చాలి.

జానీ :- కరెక్టు పింకీ-కరెక్టు- నీలాటి వాళ్ళంతా ముందుకు రావాలి. స్త్రీకి స్వేచ్ఛనివ్వి కావలసినవాణ్ణి పెళ్ళిచేసుకునేటట్టు ఇష్టమొచ్చినన్ని పెళ్ళిళ్ళు చేసుకునేటట్టు చట్టాలు రావాలి. అప్పుడుగాని ఈ ఇండియా బాగుపడదే.

(ఇంతలో రాధ చప్పట్లుకొడుతూ ప్రవేశం)

రాధ :- శహభాష్ సిస్టర్. శహభాష్- బాలాబాగాచెప్పావు. నీలాటి ఆదర్శమూర్తులుంటే తప్ప ఇండియా బాగుపడదు. ఇంతకీ ఎంతసేపయిందివచ్చి.

జానీ :- ఇప్పుడే వచ్చాను. ఇంతలో పింకీ వచ్చింది.

రాధ :- హల్లో పింకీ బాగున్నావా

పింకీ :- ఆ - బాగానె ఉన్నా.

రాధ :- సిస్టర్ - కాఫీలు అవి తీసుకున్నారా !

జానీ :- ఓ ! అన్నీ పూర్తయ్యాయి.

రాధ :- అలాగా. అదిసరే ఇంతకీ సిస్టర్. నీ ఉద్దేశం స్త్రీలు ఎక్కువగా పెళ్ళిళ్ళు చేసుకుంటే గొప్పనా లేకా సుఖపడిపోతారనా.

జానీ :- గొప్పకేముంది సుఖపడతారనే. కట్టుకున్నభర్త తిండిపెట్టక చావగోట్టి బాధలు పెడుతూంటె వాడిని వదిలి ఇంకొకడిని పెళ్ళిచేసుకోడంలో తప్పేముంది.

రాధ :- భర్త చావగొట్టి బాధలు పెడుతూంటే వాడికి విడాకులిచ్చి పెళ్ళిచేసుకోడంలో తప్పేమీలేదు. కాని కొంత ఓర్మిపట్టి వాడిని మార్చడానికి ప్రయత్నించాలి. మారేటట్టు చేయ్యాలి.

జానీ :- అది నీపిచ్చి సిస్టర్. మనం ప్రయత్నం చేసినంతమాత్రాన మారుతాడా, అయినా వాడిని బ్రతిమాలవలసిన అవసరం మనకేముంది. మొదటినుంచి అలా బ్రతిమాలే లేడీస్ ఉండబట్టే మొగవాళ్ళంతా నెత్తికెక్కుతున్నారు. వాడినివదిలి ఇంకొకణ్ణి పెళ్ళిచేసుకుని సుఖపడాలి. అప్పుడే వాడి తిక్క కుదురుతుంది.

రాధ :- నీ ఐడియా చాలా బాగుంది. ఎవరికి తిక్కకుదిరేది మనకే. పంతానికెళితే అసలు ఏం తేలుతుంది మనకి. పిల్లలు పుట్టినతరువాత ఆ పిల్లల్ని తండ్రికి దూరం చెయ్యడం అన్యాయం! అయినా మొదటిపెళ్ళి కావడానికే ఇంత కష్టమైన ఈ రోజుల్లో రెండవపెళ్ళి చేసుకోడానికి ఎవరు ముందుకొస్తారు. ఇవన్నీ చాలా ఆలోచించవలసిన విషయాలు ఏమంటావు పింకీ.

పింకీ :- నేనేంచెబుతాను రాధా నాకు తోచిందేదో ఇంతవరకు చెప్పాను. అయినా ఇండియా సంగతంతా నువ్వే మాట్లాడుతున్నావు ఫారిన్ సంగతంతా జానీ మాట్లాడుతోంది అందుకే రెండూ వింటూ కూర్చున్నాను.

రాధ :- నవ్వు (ఆ—ఆ)

జానీ :- అయితే నువ్వెవరిపక్షం పింకీ

పింకీ :- అయ్యో జానీ నేనెవరిపక్షంకాదు జానీ ఇద్దరి పక్షమూనూ.

రాధ :- ఇందులో పక్షాలకేముంది పింకీ. ఇండియా ముందుకు రావాలంటే స్త్రీలలో విజ్ఞానం బాగా పెరగాలి. ఆర్థికంగా ముందంజవెయ్యాలి. అప్పుడుకాని కొన్ని సమస్యలు తీరవు.

జానీ :- పింకీ- ఇద్దరిపక్షమూ అనకూ ఏదోఒక పక్షమే ఉండాలి.

పింకీ :- అదికాదు జానీ. నాకు ఫారిన్ పద్ధతులంటే ఇష్టం అందుచేత నీ పక్షం. ఇక ఫారిన్ నేనేలాగూ వెళ్ళలేను. ఎలాగూ ఇక్కడిపద్ధతులే అవలంబించాలి. అందుకే రాధ పక్షం తెలిసిందా.

(ఇంతలో సుబ్బి రాక)

సుబ్బి :- అయితే మీరు గబ్బిలంగారిన్ని మాటండి.

అందరూ నవ్వుదురు (కాఫీ కప్పులు పట్టుకుని సుబ్బి వెళ్ళిపోవును.)

రాధ :- అదిసరే. జానకీ, ఇంకా ఫారిన్‌లోనే ఉంటానన్నావు ఇంత సడన్‌గా ఊడి పడ్డావేమిటి?

జానీ :- ఏంలేదు అసలు నేను ఇండియాకు ఇప్పట్లో రావాలనుకోలేదు. నా ఫ్రెండు ఇండియా చూడాలంటే కూడావచ్చా. అంతే

పింకీ :- ఇంక నే వెళతా జానీ. మళ్ళీ సాయంకాలం కలుసుకుందాం

జానీ :- అప్పుడే వెడతానంటావేమిటి పింకీ, నా ఫ్రెండు ఒస్తాడు అతనికి నిన్ను పరిచయం చేస్తాను.

రాధ :- జానకీ- ఎవరా ఫ్రెండు?

జానీ :- ఎవరేమిటి సిస్టర్. నా క్లాస్‌మేట్ Mr. Torch.

రాధ :- ఓ హో! బోయ్‌ఫ్రెండా? (నవ్వు)

జానీ :- ఎందుకు నవ్వు సిస్టర్. బోయ్‌ఫ్రెండుంటే తప్పా?

రాధ :- అబ్బే! తప్పెందుకు, చాలాసంతోషం.

పింకీ :- అబ్బా! జానీ- నువ్వు చాలా ఎడ్వాన్స్డన్నమాట.

జానీ :- ఎడ్వాన్స్‌కేమిటి పింకి పారిస్‌లో అందరు అలాగే ఉంటారు.

రాధ :- ఓ హో! ఇదన్నమాట ఎడ్వాన్స్డంటే చాలాబాగుంది.

జానకీ:- మరేమనుకుంటున్నావు. అయినా నీకేంతెలుసు సిస్టర్ ఈ రోజుల్లో ఫేషన్, Boy ఫ్రెండు లేందే, ఎక్కడికైనా వెడితే ఏం ఎంజాయ్ చేస్తాం చెప్పు.

రాధ :- ఓహో అలాగా అంతవరకు వచ్చిందన్నమాట, అయినా అవన్నీ నాకేం తెలుస్తాయి.

జానీ :- అదికాదు సిస్టర్? చదువుకుని ఏం ప్రయోజనం. కాలంతోపాటు మనం మారుతూ ఉండాలి. పాత చింతకాయ పచ్చళ్ళలాగా ఉంటే సంఘం ఎప్పటికి మారదు అయినా మగవారిమధ్యలో తిరగందే వాళ్ళనెలా అర్థం చేసుకుంటాము - పెళ్ళి చేసుకుని ఎలా సుఖపడతాము.

రాధ :- వాణ్ణి అర్థం చేసుకోడానికి అలా తిరుగుతున్నారంటేనే నమ్మను. వివేకంతో ఏపనిచేసినా విజయం లభిస్తుంది కాని అది యవ్వనపు పొంగు మాత్రమే అంత అర్థంచేసుకుని పెళ్ళిచేసుకుని విడాకు లెందుకిచ్చుకుంటున్నారు. అంటే సరియైన అవగాహనలేకుండానే వాళ్ళుకూడా పెళ్ళిచేసుకుంటున్నారని అనాలి.

పింకీ :- రాధా నువ్వుచెప్పింది కొంతవరకు సహజమే అనిపిస్తోంది. అది బాగా ఆలోచించవలసిన విషయమే.

రాధ :- ఇప్పటికేనా తెలిసిందా, పింకీ: ఇంతకీ సిస్టర్ అంతచదువు మధ్యలోఆపి ఏం చేయదలచావు ?

జానీ :- చదువాపడానికేముంది తిరిగి వెళ్ళాక ఏదైనాజాబ్ సంపాదించి అక్కడే సెటిల్ అవ్వదామనుకుంటున్నాను. నువ్వేం చెయ్యదలిచావు సిష్టర్.

పింకీ :- ఇంక నేవెడతా జానీకి - బై - బై -

జానీ :- టా ! టా బై - బై -

రాధ :- నేనా ఇంకా ఏంచెయ్యాలో ఆలోచించుకోలేదు. ప్రస్తుతం ఒక నర్సింగ్ హోమ్‌లో పని చేస్తున్నాను. బహుశా ఏ విలేజీలోనో ప్రాక్టీసుపెట్టి పల్లె ప్రజలకు వైద్యంచేసి సహకరిద్దామనుకుంటున్నాను.

జానకి :- హా హా ! హా ! - (పెద్దనవ్వు).

రాధ :- జానకీ - ఏమిటానవ్వు.

జానకి :- హా ! హా ! హా ! (నవ్వుతూ) ఓ మైడియర్ సిష్టర్ విలేజీలోనా ! ఆహా ప్రాక్టీసా. ఆబురదర్లో, ఆజంగ్లీ మనుష్యులలో ఎలావుంటావు ? అంత మెడిసిన్‌చేసి ఫారిన్ డిగ్రీపుచ్చుకొని అంతా వ్యర్థం చేస్తావన్నమాట. నీలైఫ్ అంతా పాడుచేసుకుంటావన్న మాట.

రాధ :- మైడియర్ పూర్ సిష్టర్ ? మనం పుట్టి పెరిగిందెక్కడా ఈ బురదల్లో కాదా ! ఫారిన్‌వారు మాత్రం వారి ప్రజల్ని వారు ఇనసల్టు చేసుకుంటున్నారా ! మనం పుట్టిపెరిగినదేశం ఏదైనా మనం లైక్‌చెయ్యాలి.

జానీ :- లైక్ చెయ్యవచ్చు. కాని ఇన్ని పెద్ద-పెద్ద నగరాలుండగా ఆమూర్ఖులతో ఎలా వేగుతావు;

రాధ :- పెద్ద పెద్ద నగరాలున్నాయి. కాని అక్కడఉండేది మనుష్యులేకదా ! తగిన వైద్య సదుపాయాలు లేక ఎంతోమంది చచ్చిపోతున్నారు. మనలాటి చదువుకున్నవాళ్ళంతా వారిని ఆదుకోవాలి . . . .

జానీ :- అ — అ — నవ్వు. ఆదుకోవాలి బాగానేఉంది కాని మనసంగతి కూడా చూసుకోవాలి. వారిచ్చే తోటకూర కాడలకాసించి అక్కడ ప్రాక్టీసు పెడితే మిగిలేదేమిటి సిస్టర్.

ధరా :- వారిచ్చేది తోటకూరకాడలైనచాలు, అవీ ఇవ్వకపోయినా వైద్యం చెయ్యాలి. కేవలం డబ్బు కాదు మనిషికి ప్రధానమైంది నీలాటి చదువుకున్న మూర్ఖులవల్ల స్వార్థపరులవల్లే మనదేశం ఇంకా అధోగతిపాలవుతోంది.

సుబ్బి :- బాగా సెప్పారమ్మా — బలేగా సెప్పారండి.

జానీ :- సుబ్బీ — స్టుపిడ్ — షట్ ప్ నోరుమూసుకు లోపలికెళ్ళు.

సుబ్బి :- అలాగె ఎల్తాలెండి. అయినా నాకెందుకులెండి.

(ముసలమ్మ బామ్మ ప్రవేశం. కొంచెం వణుకుతూ మాట్లాడవలెను.)

బామ్మ :- ఏమర్రా మన జానకీ వచ్చిందట. దాన్నిచూసి ఎన్నాళ్ళయిందో? ఏదే జానకీ ఎక్కడున్నావే.

జానీ :- హల్లో మైడియర్ గ్రాండ్ మదర్

బామ్మ :- ఏమిటే? ఎమిటే ఎవరునువ్వు (ఆశ్చర్యంగా) నువ్వు? నువ్వు మా జానకివేనా— కాస్త దూరంగాఉండి మాట్లాడు అలా మీదపడతావే—టి?

సుబ్బి :- అవునండి మన జానకమ్మగారేనండి.

జానీ :- గ్రాండ్ మదర్ నేను పేరు మార్చుకున్నాను నా పేరిప్పుడు జానీ తెలిసిందా?

బామ్మ :- అంతటి చక్కటిపేరూ మార్చి అదేం పేరు పెట్టుకున్నావే. అయ్యో! అయ్యో! మన పక్కింటివాళ్ళ కుక్కపేరు పెట్టుకున్నావుకదే. అక్కడందరూ నీలాగ కుక్కపిల్లలపేర్లే పెట్టుకుంటారేమిటే? నీకేమివచ్చిందే?

సుబ్బి :- అ — అ — (నవ్వు)

రాధ :- అదిగో అలా అడుగు నాయినమ్మా— మంచిలేదు చెడ్డాలేదు అన్నీ ఫేషన్లే.

జానీ :- కుక్కపేరు కాకపోతే నక్కపేరు పెట్టుకుంటాను నీకెందుకుబాధ.

బామ్మ :- ఇంకా సిగ్గులేకుండా ఏమిటే ఆ మాటలు, అయినా ఆ పేరుతోపాటు ఆ వేషాలేమిటే? అయ్యో! అయ్యో ఆడమగా తెలీకుండా ఆ బట్టలేమిటే? ఇంటా వంటా ఎక్కడైనా ఉందా? ఏదో చదువుకువస్తావని సంబరపడ్డాగాని ఇలాటి మోజులవెయ్యం పడుతుందనుకోలేదు. అయినా నిన్నని ఏం ప్రయోజనం ఇదంతా మీ అమ్మచేసిందే?

జానీ :- వాట్ గ్రాండ్ మదర్. నే నేంచేశానని అలా అరుస్తున్నావ్. నీకసలు మేనర్సు లేవు?

బామ్మ :- ఏమిటి మేనర్సా— అదేంమాటే రాధా.

రాధ :- ఏంలేదు నాయనమ్మ — నీకెలా మాట్లాడాలో తెలీదుట.

బామ్మ :- ప్రొద్దుపొడ్చి పిల్లను వెక్కిరింపిందిట. ఆలాగుంది దీనివరస.

జానీ :- అపును గ్రాండ్ మదర్. చిన్నవాన్ని ఫారెన్‌వెళ్ళి వచ్చినదాన్ని నాకు కోరిక యుండదా ? మానరివాలింకెప్పుడు తీర్చుకోవాలి. నీలా మూలకూర్చోడానికి నేను వీధిబడిలో చదువుకున్నా ననుకున్నావా !

బామ్మ :- ఆ - ఆ - పైగా చేసిందిచాలక సిగ్గులేకుండా సమర్ధించుకోడం కూడానా. పెద్ద చిన్న భేదం లేకుండా మాట్లాడుతున్నావు. అయినా చిన్నపిల్లకు నీకు బుద్ధి లేకపోతే మీ అమ్మబుద్ధి ఏమయిందే ? కాస్త పిల్లలకి భయభక్తులు చెప్పొద్దుటే. నేనయితేనా కాళ్ళు విరగకొట్టి కూర్చోపెట్టేదాన్ని. అయినా ఏన్నని ఏం ప్రయోజనం. సీమ చదువులు వద్దంటే మీ నాన్న విన్నాడా - అయ్యో ! ఖర్మ - ఇప్పుడేం చెయ్యాలిరా !

(నెత్తిన చేతులుపెట్టుకుని క్రింద చతికిలబడును.)

జానీ :- భయభక్తులు చెప్పడానికి నేనేం చిన్నపిల్లననుకున్నావా ? నేనెలా ఉంటాలో నీకంటె నాకు బాగాతెలుసు అక్కడ ఫారెన్‌లోచూడు అందరూ ఎంత డెవలప్ అయ్యారో. ఆడా మగా తేడా లేకుండా ఇష్టమొచ్చిన డ్రస్సులో హాయిగా తిరుగుతారు. ఛీ ! ఛీ ! ఎప్పుడూఇంతే అందుకేనేనసలు ఇండియాయే రావద్దనుకున్నాను.

(తల్లి ప్రవేశం)

తల్లి :- అయ్యో ! అయ్యో ! ఇదేం ఖర్మండి. పిల్ల వచ్చిందిమొదల్లు దాన్ని బతక నివ్వరు. మీకు సరదాగా ఉంటే మీకు నచ్చినవేషం మీరేసుకోండి - ఎవరొద్ద న్నారు? అయినా అది చేయకూడనిపని ఏం చేసిందని? సరదాగా బట్టలు వేసు కోడంకూడా తప్పేనా? అయినా ఆ. మనుమరాలు ఈ నాయినమ్మా అంతా ఒక్కటే పట్టి కుళ్ళుమోతు మనుషులు?

జానీ :- అలా చెప్పుమమ్మీ. ఎక్కడో బి. సి. నాటి మనుష్యులు. ఒక్క క్షణం ఇంట్లో వుంటే బోరెత్తిపోయింది.

సుబ్బి :- ఏటో ఇదంతా, పెద్దోళ్ళని యీరికసలు భయమేలేదు. మొదటినుంచి యింతే.

బామ్మ :- అయ్యో, అయ్యో తల్లీ పిల్లకలసి ఎంతకేసి మాటలంటున్నారే. ఇదంతా

నాఖర్మ, మీతాతగారే బ్రతికుంటే మీరంతా ఇలా అనేవారా ! అయ్యో - అయ్యో - ఇంక నేనేమి చేతునర్రో (అంటూ ఏడుపు).

సుబ్బి :- అయినా బామ్మగోరు. ఇప్పుడేడిస్తే ఏం లాభమండి, తాతగారు మీపోరు పడలేకనేకదండి సన్యాసుల్లో కలిసిపోయినారు.

రాధ :- సుబ్బీ ! నోరుమూసుకు లోపలికెళ్ళు.

సుబ్బి :- అలాగే ఎడతాలెండి - అయినా నాకెంచ కులెండి.

రాధ :- జానకీ - పెద్దవాళ్ళతో ఎలా మాట్లాడాలో కాస్త నేర్చుకోవాలి. పెద్దవాళ్ళుం డగా అన్నింటికి మనిష్టమంటే సాగదు. పైగా ఆవిడమీద విరుచుకుపడితే ఏం ప్రయోజనం. అయినా నాయనమ్మా దాంతో నీకేంపని. నువ్వు లోపలికెళ్ళు.

బామ్మ :- సరేలే అమ్మా; అలాగేవెడతాను. అయినా కాటికి కాళ్ళుచాచుకూర్చున్నాను నాకెందుకులే ఆ గొడవలన్నీను. ఏదో బాగుపడతారని చెప్పానమ్మా — అంతే —

(లోపలికెళ్ళును)

జానీ :- అమ్మయ్యా పీడాపోయింది. మమ్మీ చూశావా ఇక్కడ నేనెలాఉండను ఇంట్లో అడుగు పెట్టిందిమొదలు అందరు ఒకటేగొడవ. బోరెత్తిపోతోంది. టార్చి వస్తానన్నాడు ఇంకా ఎందుకు రాలేదోఏమో ! నేనలా వెళ్ళివస్తా మమ్మీ

తల్లి :- సరేనమ్మా — అలా వీధిలోవరకు వెళ్ళిచూడు. నే లోపలికెళ్ళి పనిచూసు కుంటాను.

(తల్లి జానీ లోపలికెళ్ళుదురు)

(రాధ రేడియో చేతపట్టి ట్యూన్ మారుస్తూ పాట పాడుచుండును)

పలుకే బంగారమాయెనా — కోదండరామ
పలుకే బంగారమాయెనా ॥ కోదండ ॥
పలుకే బంగారమాయె— పిలిచిన పలుకావేమి
పలుకే బంగారమాయెనా ॥ కోదండరామ ॥ పలుకే॥

(ఇంతలో మిస్టర్ టార్చి, జానీ చేతులుపట్టుకు లోపలికొస్తారు)

టార్చి :- ఓ : వాట్ బ్యూటిఫుల్ సాంగ్ — వాట్ బ్యూటిఫుల్ సాంగ్, రియల్లీ మె

లో డి యప్.

జానకి ఎవరు ఆమె?

(రాధ పాట ఆపి వెనక్కి తిరిగిచూడవలెను)

జానీ :- షి ఈజ్ మై సిస్టర్ రాధ. అన్నీ ఓల్డుసాంగ్సే. ఒక్క మోడరన్‌సాంగ్ కూడా రాదు.

టార్చి :- ఓ - ఓల్డుసాంగ్సా - వాటిని నేను చాలా లైక్ చేస్తాను. గ్లాడ్ టు మీట్ యు రాధగారు.

(షేక్ హాండు ఇవ్వబోవును)

జానీ :- సిస్టర్ ఈయన మిస్టర్ టార్చి — నా ఫ్రెండ్.

రాధ :- అలాగ నమస్తే— (అంటూ చేతులు జోడించును)

టార్చి :- రాధగారు మీ సాంగ్సు చాలా బాగుంది, రాధ మీ పేరుకూడా ఎంతో బాగుంది. ఏదీ ఆ సాంగ్ ఆపేశారే కంటిన్యూ చేయండి.

రాధ .- నా సాంగ్సుకేమికాని మీకు తెలుగు బాగావచ్చునే.

టార్చి :- ఓ! తెలుగా —(నవ్వు) మీ సిస్టర్ నేర్పింది. అయినా అంతబాగా రాదు. అందుకే నాకు మీ సిస్టర్‌కి ఫ్రెండ్‌షిప్ అయింది. నేను మీ పురాణాన్ బాగా చదివినా మీ భారత, భాగవత రామాయణ కథలన్నీ నేర్చుకున్నా.

రాధ :- అలాగా! చాలా సంతోషం. ఇప్పుడు మా ఇండియన్స్ వాటిని చదవడంలేదు అసలు రామాయణ భారతకథలు తెలియనివారెందరో ఉన్నారు. అందులో ఇంగ్లీషు బాగా చదివినవారు వాటిముఖమేచూడరు.

టార్చి :- వాట్ చదువుకున్నవారుకూడా రామాయణ్ ఎందుకు చదవరు?

రాధ :- ఎందుకేమిటి? ఫేషన్ కాదని అది చదివిన వారు వీళ్ళదృష్టిలో అనాగరికులు మూర్ఖులు

టార్చి :- వెరీ శాడ్ థింగ్ నాకు చాలా ఆశ్చర్యంగాను బాధగానుకూడా ఉంది. నేను మీ ఇండియన్ కల్చరల్ బుక్సు అన్ని చదివినా. అందుకే ఇండియాచూడాలని వొచ్చినా, మీ సిస్టర్ నేను వద్దంటున్నా వినకుండా చదువుమధ్యలో ఆపివేసి నన్ను ఫాలో అయింది.

రాధ :- ఓ ! అలాగా కూర్చోండి. ఇప్పుడేవస్తాను

(లోపలికెళ్ళును)

జానకి టార్చ్ ఒకళ్ళ భుజాలపై ఒకళ్ళు చేతులు వేసుకొని సిగరెట్టు చేతపట్టుకొని కూర్చుందురు )

టార్చి :- వాట్ జానకి, నువ్వు సిగరెట్టు కాల్చకు - మీ అక్క చూస్తే బాగుండదు. No No. నువ్వు కాస్త దూరం జరిగి కూర్చో.

జానీ :- మై డియర్ టార్చి ఎందుకలా భయపడతావు. ఒకళ్ళనుచూసి నేనెప్పుడూ భయపడను.

టార్చి :- వాట్ నువ్వు చాలా డేర్ చేస్తున్నావు. మీ ఇండియన్ మేనర్స్ ఒకటీలేవు నీకు, నువ్వుకూడా శారీస్ ఎందుకు కట్టవు జానకి ?

జానీ :- నాకు ఆ శారీస్ అంటేనే బోరు, అయినా అదేంఫేషన్ పల్లెటూరి అమ్మలక్కలాగ. మై డియర్ నన్ను జానకి అనవద్దని ఎన్నోసార్లు చెప్పానా ? నువ్వలా అంటే నాకు హెడేక్ వస్తోంది.

(ముఖం ముడుచుకొనును)

టార్చి :- ఓ కోపమా మై డియర్ నాకు మీ ఇండియన్ నేమ్స్ అంటె చాలా ఇష్టం. 'జానకి అంటె ది వైఫ్ ఆఫ్ రామ' అని చదివాముకదా రామా చాలాగొప్పవాడు ఆయన వైఫే జానకి, అంటె నాకు చాలాఇష్టం, అంత మంచిపేరు ఎందుకు లైక్ చెయ్యవు ? పేరు మార్చుకుంటేగాని ఫేషన్కాదా ఏమి ? (ఇంతలో సుబ్బి ప్రవేశం)

సుబ్బి :- అయ్యబాబోయ్ — అయ్యబాబోయ్. ఏటో ఇదంత. మన సిన్నమ్మాయిగోరు ఇలా కూకున్నారేటి) అయినా ఈరుకూడా అమ్మాయిగోరేనేమో ? అయినా నాకేటి తెలుస్తాది,

(జానకి టార్చి వెనక్కుతిరిగి చూచెదరు.)

జానీ :- ఏయ్ సుబ్బీ, దుబ్బీ - ఏమిటావాగుడు

సుబ్బి :- అయ్యబాబోయ్ అమ్మాయిగోరు శానా పాడయిపోయినారండి. సిగరెట్టుకూడా

కాల్చేస్తున్నారండి బాబోయ్ - ఏదో పేలయ్యేటట్లుందండి బాబోయ్ - (అని లోపలి పరిగెత్తును)

టార్చి :- ఎవరు ఆమె ?

జానీ :- మా సర్వెంటు సుబ్బి.

టార్చి :- వాట్ సుబ్బి. పేరు చాలాబాగుంది. లేడీ చాలా చిత్రంగాఉంది. చాలా హుషారుగా కూడా ఉంది.

జానీ :- హుషారులేదు ఏంలేదు. మొద్దుమొహం. వట్టి పల్లెటూరి గబ్బిలం.

టార్చి:- వాట్ గబ్బిలం (ఆ — నవ్వు)

జానీ :- ఎందుకానవ్వు.

టార్చి:- వాట్ గబ్బిలం — ఆ — ఆ — ఆ (నవ్వు)

(ఇంతలో రాధ ప్రవేశం)

రాధ :- (కోపంతో) జానకీ ఏమిటూపని కొంచెంకూడా విచక్షణా జ్ఞానం లేకుండా ప్రవర్తిస్తున్నావు.

జానీ :- నేనా ! నే నేంచేశానని అలా అరుస్తున్నావు? (కొంచెం జరిగికూర్చుంటూ)

రాధ :- జానకీ ఏం చేస్తున్నావో నీకేతెలియాలి. ఇది ఫారిన్‌కాదు ఇండియా చదువు కోడం ఎందుకనుకుంటున్నావు. ఇలా ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడానికికాదు. మూఢనమ్మకాలు తొలగించి నాగరికత పెంచుకోడానికి. అంతేకాదు ఫారిన్ వెళ్ళడం ఎందుకనుకుంటున్నావు? విదేశీయుల మంచిపద్ధతుల్ని క్రమశిక్షణను గ్రహించటానికి. ఇలా చెడిపోవడానికాదు?

జానీ :- జాగ్రత్తగా మసలుకోవలసిన అవసరం నాకులేదు అయినా నీపాటి జ్ఞానం నాకుందిలే.

రాధ :- ఓ ! అక్కా అని పిలవడానికి తమరికి నామోషీయేమో? నిజమేనీలాటి చెల్లెలికి అక్కగాఉండె అర్హత నాకు లేదనుకుంటాను. నీవేకాదు నీలాటివాళ్ళెందరో ఉన్నారీదేశంలో ఫారిన్ వెళ్ళి మూడేళ్ళయ్యిందోలేదోకాని తెలుగు సాంప్ర దాయాన్నేకాదు తెలుగుభాషనుకూడా మరచినట్లు నటిస్తున్నావు?

జానీ :- నువ్వా నాకు నీతులునేర్పేది ఛీ ! ఛీ ! నీకంత నాపై యీర్ష్యఉంటే నువ్వు

కూడా మారు అంతేకాని నోటికొచ్చినట్లు మాట్లాడకు నాఫ్రెండుఎదురుగఉన్నా డన్నసంగతేమరచి మాట్లాడుతున్నావు. ఇదే కాబోలు నీ బోడిసంస్కారం.

రాధ :- జానకీ ! శ్రుతిమించి రాగాన్నిపడిన నువ్వా సంస్కారాన్నిగురించి మాట్లాడేది అంత అభిమానమున్నదానివైతే ఇలా చేసిఉండేదానివికాదు.

జానీ :- రాధా ! షటప్. ఊరుకున్నకొద్దీ రెచ్చిపోతున్నావు ? రాస్కెల్. (అంటూ అక్కను దవడపై కొట్టను.)

టార్చి:- జానకి వాట్ ఈజ్ఇట్

రాధ :- ఏం ! ఆగావేం ఇదిగో ఈ చెంప మిగిలింది కొట్టు అప్పటికైనా నీ ఆవేశం తగ్గుతుందేమో. నువ్వు ఏది ఫేషనని తిరుగుతున్నావో అదే నీకు చెరుపు. చేస్తుంది. అదే నీకు కళ్ళు తెరిపిస్తుంది,

జానీ :- షటప్ రాధా - ఇంకేమివాక్కు. నే నెలాఉండాలో నాకు బాగాతెలుసు. మై డియర్ టార్చి ! రా ! వెళ్ళిపోదాం. ఈ కుళ్ళు సంఘానికి దూరంగా వెళ్ళి పోదాము రా ! కమాన్.

టార్చి:- మై డియర్ జానకీ — ఎక్కడికి వెడదాం.

జానీ :- ఎక్కడికేమిటి. ఎక్కడికో అక్కడికి హాయిగా బ్రతకడానికి,

టార్చి:- జానకి — నీతోనా — నో — నో — నో నేను నీతో షికార్లు చెయ్యడానికి ఇక్కడికి రాలేదు. నాకు టైంలేదుకూడా.

జానీ :- మై డియర్ టార్చి మరెందుకొచ్చావిక్కడికి.

టార్చి:- జానకీ — ఎందుకొచ్చానో నీకు బాగాతెలుసు వరల్డులో ఫేమస్గాంచిన ఇండియన్ కల్చర్ అన్నా, పీపుల్ అన్నా మేము చాలా లైక్చేస్తాము, అందుకే చూసి తెలుసుకోవాలని ఒచ్చినా ?

జానీ : మనిద్దరం కలిసేపోదాం.

టార్చి :- నీతోనా - నో - నో నేనునిన్ను లైక్ చెయ్యలేకపోతున్నాను. నువ్వు చాలా నేర్చుకోవాలి. మీఅక్కచూడు ఎంతో మేనర్పుగాఉంది. నువ్వు మీసిస్టర్చూసి నేర్చుకో.

జానీ :- మైడియర్ నువ్వుకూడా అదే అంటున్నావా ?

టార్చి :- నేనేకాదు; ఎవరైనా ఆదే అంటారు. నువ్వు బాగా చదువుకుని కల్చర్ పెంచుకోవాలి.

జానీ :- టార్చి నాచదువుకి ఇప్పుడేమంత తక్కువైందని ఫారిన్ వెళ్ళి చదువుకుంటాను ఇప్పుడు హాయిగా తిరుగుదాం.

టార్చి :- నాకు టైం వేస్టు అవుతుంది. నేను ఇండియాలో ఎన్నోప్లేసెస్ చూడాలి. అవి ఉన్నట్టే నీకు తెలియదనుకుంటాను ఇంకవాటినిగురించి నీ వేమి చెబు తావు.

జానీ :- మిస్టర్ టార్చి. యు ఆర్ రియల్లీ ఛేంజిడ్.

టార్చి :- నేను ఛేంజి కాలేదు. నువ్వు ఛేంజికావాలి. ఇండియాలోపుట్టి ఇండియా అంటే ఏమిటో తెలియికుండా బ్రతుకుతున్నావు. రియల్లీ ఐ యామ్ వెరీ సారీ.

జానీ :- మిస్టర్ టార్చి — మాట మార్చకు. నేనంటే ఇష్టములేనివాడివి నాతో అంత ప్రేమగా ఎందుకు మాట్లాడెవాడివి. నాతో ఎందుకంత క్లోజ్‌గా ఉండేవాడివి

టార్చి :- మేము ఎవ్వరితోనైనా అలాగె ఉంటాము. ఇన్నాళ్ళు అక్కడేఉండి నువ్వెందుకు గమనించలేదు.

జానీ :- నువ్వు నిజంగా మా అక్కనుచూసి మారిపోయావు. అప్పుడు నా వెంట పడ్డావు ఇప్పుడిలా అంటున్నావు.

టార్చి ,- నే నెప్పుడు నీ వెంబడి పడలేదు. రియల్లీ ఐ యామ్ సేయింగ్. మీ సిస్టర్‌ను చూసి అందరు మారాలి. ఇంక నీతో మాట్లాడెటైం లేదు నాకు. ఇప్పుడే ఢిల్లీకి వెడుతున్నాను.

జానీ :- టార్చి. నువ్వెళ్ళడానికి వీల్లేదు, నువ్వెళ్ళడానికి వీల్లేదు.

టార్చి :- జానకీ నన్నొపకు ఫ్రెండుగా ఏదైనా హెల్పుఉంటే చేసిపెడతాను. అంతే కాని ఇప్పుడు నీతో షికార్లకు టైంలేదు,

జాని :- టార్చి నువ్వంతమాటనకు నీకు ఎలా ఇష్టమైతే అలాగె ఉంటాను. అంతేకాని నువ్వు లేకపోతే నే బ్రతుకలేను. టార్చి నామీద కోపగించకు

టార్చి :- కోపమా అ అ అ — (నవ్వి) ఎందుకు? నే వెడుతున్నాను

జాని :- టార్చి, నువ్వంతమాటనకు నువ్వు వెళ్ళడానికి వీల్లేదు,

టార్చి :- నో, నో — నో జానకీ — ఇక ఏమి మాట్లాడకు, మై డియర్ రాధగారు నమస్తే, మీలాటి లేడీస్ అంటె మేము లైక్ చేస్తాము, మీసాంగ్సు మీ

మేనర్స్ నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. రియల్లీ ఐ యామ్ వెరీ హాపీ.

రాధ :- థ్యాంక్యూ.

టార్బి:- ఇండియన్ కల్చర్ అంతా మీ దగ్గరే ఉందనుకుంటాను. ఇండియా అంతా తిరిగివచ్చాక మిమ్మల్ని తప్పకుండా కలుసుకుంటాను. మీ సాంగ్స్ రికార్డు చేసి నాతో పట్టుకువెడతాను.

రాధ :- తప్పకుండా పట్టుకెళ్ళండి.

టార్బి :- ఓకే రాధగారు — ఒకే. గుడ్ బై జానకి గుడ్ బై.

(టార్బి వెళ్ళును. - రాధ మరోపక్కనుంచి లోపలికెళ్ళును)

జాని :- టార్బి ! టార్బి ! వెళ్ళిపోతున్నావా — ఆ —ఆ వెళ్ళిపోయావా (ఏడుపు) నిన్ను సంతోషపెట్టాలనేకదా యిన్నివేషాలు వేసినా చివరకు నన్నే మోసంచేశావు నలుగురిలో తలెత్తుకోకుండా చేశావు. (ఏడుపు)

(సుబ్బి ప్రవేశం)

సుబ్బి :- ఏటండీ — ఈ ఏడుపంతా — అసలిప్పుడేంజరిగిందనండి లెగండి — లెకండి.

జాని :- ఏంజరగడమేమిటే—టార్బి నన్ను మోసంచేసి వెళ్ళిపోయాడు ఇప్పుడునేనెలా అందరిముఖాలు చూడనే.

సుబ్బి :- పోతేపోయింది తమ్మగోరు పీడపోయిందండి అసలా తెల్లోళ్ళని నమ్మకూడదండి.

జాని :- నీకేంతెలుసునే నా బాధ. అప్పుడందరిలో నేనెంతలోకువో చూడవే. అప్పుడే అందరు నన్నెలా చూస్తున్నారో చూడు. (జనంకేసి చూపించి) చూడండి — ఒక వింతజంతువును చూసినట్టు చూడం . నవ్వండి — బాగా నవ్వండి.

(ఆ — ఆ ఆ — ఏడుపు)

సుబ్బి :- ఓయబ్బో. ఏటండి యీ ఏడుపు. ఈ కూసంతదానికే ఇంతగా ఏడ్వాలేటండి లెగండి లెగండి అయినా కాకుల్లాంటి లోకంతో మనకేటిపనండి. అయినా ఇదంతా మీ పెద్దోళ్ళదేతప్పండీ. ఆరికి అసలు తెలివిలేదండి. పిల్లలేదేన కూసంత తప్పుచేస్తే కూకలేసి కూకోపెట్టాలికానిండి ఒదిలేసి ఊరుకుంటే ఎట్టాగండి.

జానీ :- సుబ్బీ ! నే నసలే నగంచచ్చి ఏడుస్తుంటె నీగోలేమిటే - చూడవే వాళ్ళంతా

ఎలా నవ్వుతున్నారో —

సుబ్బి:- మిమ్మల్నిచూసి ఎవరు నవ్వుతారండి. నవ్వినోళ్ళంతా తెలివిలేనోళ్ళేనండి అసలు తప్పులు సెయ్యంది ఎవరంటారు. అయినా సక్కగా చదివినారు. అందంగా బంగారుబొమ్మలా ఉంటారు. మీకేటండి.

(తల్లి ప్రవేశం)

తల్లి :- అయ్యో నా జానీ వాడెల్లిపోయాట్టే.

జానీ :- మమ్మీ ! (అంటూ కౌగలించుకొని ఏడుపు)

తల్లి :- ఏడవకమ్మా ! ఏడవకు. నీకేమి తెలియదే అంతా చిన్నతనం. అయినా వాడి కోసం ఏడవడం దేనికి. గిసిన కందగడ్డలా మొహం వాడూనూ వాడుకాకపోతే ఇంకొకడు. చక్కనివాణ్ణితెచ్చి నీకు పెళ్ళిచేస్తానమ్మా !

(బామ్మ ప్రవేశం)

బామ్మ :- ఏమిటే . ఆ గోల - వాడు వెళ్ళిపోయాడటగా. రాధ చెప్పింది అయినా ఈ మాత్రందానికే అంత ఏడుపెందుకే.

జానీ :- నన్ను క్షమించు గ్రాండ్ మదర్.

బామ్మ :- క్షమించడానికేముందే ఇందులో మీ పిల్లలందరూ ఇంతేనే. ఏమీ తెలియక పోయినా అన్నీతెలుసునన్నట్లు మసలుతారు. కాస్త తేడావస్తేచాలు ఎడుపు మొదలెడతారు. చిన్నప్పుడు అందరూ తప్పులుచేస్తారు. వాటిని సరిదిద్దుకోవాలి అంతే ఏడవకు అమ్మా లే

(రాధ ప్రవేశం)

జానీ :- అక్కా నన్నుక్షమించు. ఆవేశంతో నిన్ను అనరానిమాటలన్నాను. చివరకు కొట్టానుకూడా క్షమించక్కా.

రాధ :- క్షమించడానికేముంది జానకీ. నీ తప్పు నువ్వే తెలుసుకున్నావు. ఫారిన్ వెళ్ళడం. పెద్దచదువులు చదవటం గొప్పకాదు. లోకాన్ని మనుషుల్ని అర్థం చేసుకోడంలోనేఉంది మన సంస్కారమంతా. నీలో పరివర్తనవచ్చింది అంతేచాలు.

సుబ్బి :- ఏదీ ఇక నవ్వండి. (జానకి నవ్వు — ఆ — ఆ —ఆ ) అదిగో జానికమ్మగారు నవ్వేరు. ఏదీ అందరూ నవ్వాలి.

ఆ — ఆ - ఆ - (అందరు నవ్వుదురు)

# ఇదే మన కర్తవ్యం

## (ఏకాంకిక)

రచన : **డా॥ వాసా ప్రభావతి**

(అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా రచించిన మహిళా నాటిక)

స్వరాజ్యం వచ్చింది. అందరికి సర్వాధికారంవచ్చింది. అమాయకులు పెద్దలమీదే సర్వం వదిలి నడుస్తున్నారు అందంగా, ఆనందంగా. అతి సునాయసంగా వచ్చిన పెద్దరికాన్ని. స్వార్థంతో, అహంకారంతో, అధికార వ్యామోహంతో దుర్వినియోగం చేసుకుంటున్నారు పెద్దల పేరుతో చలామణి అవుతున్న నాయకులు. తను చేసేపనులకు అడ్డురానిది, అడ్డుపెట్టనిది. కనీసం అదేమిటని అడిగి యెరుగనిది భార్యామణి అని వారి నమ్మిక. స్త్రీలంతా అటువంటివారనే తలచి హాయిగా దేశాన్ని ఏలుతున్నారాపెద్దలు

విద్యావతి, వినయశీలి, పరోపకారపారీణ. సాహసి డాక్టరు సీత అదేగ్రామంలో ప్రాక్టీసుపెట్టి ఆ గ్రామపెద్ద గ్రామానికి సర్వాధికారి అని పిలువబడుతున్న నాగరాజును, అతని అసిస్టెంటు అవతారాన్ని కనిపెట్టి వారి రహస్యాలను తెలుసుకుంటుంది. గ్రామంలో వైద్యంతోపాటు నైటు స్కూలుపెట్టి జనుల్ని చైతన్యవంతుల్ని చేస్తుంది. ఆ గ్రామంలోని స్త్రీల సహాయంతో ముందుకువచ్చి పోలీసులకు తెలియపరచి నాగరాజును. అతని అనుచరుణ్ణి అరెస్టు చేయిస్తుంది. వారి ఆటలు కట్టిస్తుంది. అతని భార్య కళ్ళు తెరిపించి తమకు చేయూతగా నిలుపుకుంటుంది. స్త్రీలు తలుచుకుంటే సాధించలేనిదేదీలేదని రుజువుచేస్తుంది. ప్రస్తుత క్లిష్టసమస్యల పరిష్కారానికి స్త్రీల కర్తవ్యమేమిటో తెలియపరుస్తుంది.

ఇదే "మన కర్తవ్యం" నాటిక

పాత్రలు :
1. నాగరాజు గ్రామపెద్ద
2. అవతారం - నాగరాజుకు అసిస్టెంటు
3. సీత - డాక్టరు
4. రంగమ్మ - రైతుభార్య
5. మొదటి స్త్రీ - రెండవ స్త్రీ - మూడవ స్త్రీ - గ్రామవాసులు.
6. పోలీసు ఇనస్పెక్టర్
7. పోలీసు కానిస్టేబుల్

(ఇంటర్ కాలేజీలలో ప్రథమ బహుమతి పొందిన నాటిక.)

# ఇదే మన కర్తవ్యం

## రంగము - డ్రాయింగురూము

(గ్రామపెద్ద నాగరాజు కుర్చీలో కూర్చుని వుంటాడు. పంచెకట్టు కళ్ళజోడు. బుంగమీసాలు. చేతిలో సిగరెట్టు ఇంతలో అవతారం గుమస్తా ప్రవేశిస్తాడు. పంచె. లాల్చీ ధరిస్తాడు.)

నాగరాజు :- రా! రా! అవతారం. నీకోసమే సూత్తున్నా. అంత లేటయిపోయినా వేంటి? నాపానం ఎండిపోయినాదనుకో.

(కుర్చీతో కూర్చొనును)

అవతారం :- యస్సూ? వొచ్చేసినాసార్. ఇక సూసుకోండి. మీపానం గుమ గుమ గుమ గుమలాడి పోద్ది.

నాగ :- ఇంకా అలా నిట్రాటలా నిలబడ్డావేటి? సీట్లో సతికిలబడక.

అవ :- యస్సూ - ఇదిగో సతికిలబడుతున్నా?

నాగ :- నీయస్సూ గిస్సులకేటికాని కొత్త న్యూసేటో సెప్పేసెయ్యక అలా మన్ను మింగిన పాంలా కూకున్నావేటి?

అవ :- మన్నుమింగటాని కేటికాని యీ సారి శానా యింపార్టెంటు న్యూసే వున్నాదిసార్.

నాగ :- ఆ యింపార్టెంటేటో సెప్పి అగోరించవయ్యా. అలా నత్తోడిలా నానుత్తావేటి?

అవ :- యస్సూ! అలాగే అగోరిత్తా కాని సార్ మనూళ్ళో ఆ సీతమ్మగోరి సంగతే శానా తంటాలు తెచ్చేటట్టున్నదండి.

నాగ :- ఏరు? ఆ డాక్టరుపిల్ల సీతేనా? ఏడిసిందిలేవోయ్.

అవ :- యస్సూ! అంతేసార్. అమ్మమ్మ అట్టాఅంటే కాదుసార్. అది శానా దేంజరుకేసులాగె వున్నదిసార్.

నాగ :- అవతారం నువ్వుత్త పిరికిబందవయ్యా! అదేం దేంజరుకేసయ్యా?

అవ :- అదికాదుసార్ పాయింటూ - ఆరు మసూళ్ళో పాట్టిసు పెట్టేసినారుగదండే ఇక సూసుకోండి ఆడోళ్ళంతా సీతమ్మగోరి. యెనకాలె తిరుగుతున్నారంటె నమ్మండి.

నాగ :- ఎడిశారు లేవోయ్ గొర్రెలమందల్లా బుర్రలేనోళ్ళంతా అట్టాగే పోతారు. కొత్త మొకం మొత్తితేసాలు యిక మర్రోయేంపు, అట్టాటిఆళ్ళతో మనకేటిపని.

అవ :- ఆసలదికాదు సారు పాయింటూ. ఆ సీతమ్మగోరు నైటు యిస్కూలోటి పెట్టేసినారండి. ఇక సూసుకోండి పూళ్ళోవున్న ఆడ, మగ, పిల్ల, మేక ఒక్కరేటండే. అంతా తండోపతండాలు తండోపతండాలు. ఆడ కూకుని సదువంతా సదివేత్తున్నారనుకోండి.

నాగ :- సదువుకుంటున్నారో సంగీతమె పాడుకుంటున్నారో మనకేటయ్యా. ఏదోటి సత్తారు.

అవ :- యెస్సూ. ఆ-ఆ ఆదికాదుసార్, ఇంపార్టెంటు యేటంటేనండీ ఆయమ్మ సదువే కాకుండా యేటేటో సెప్పేతున్నాదండి. ఇక యీళ్ళంతా మనకంట్రోలు దాటిపోయేట్టేవున్నారుసార్.

నాగ :- ఎడిశారులేవయ్యా ! ఇక నోరుమూసుకోనువ్వు. ఈ యూళ్ళో నేనుండగా ఆడకూతురేం సేయగలదయ్యా !

అవ :- యెస్సూ ! నేను నోరుముసుక్కుంటాకాని సార్. అది శానా సీరియస్‌గానే ఆలోసింసాలండి. లేక్కపోతే యవారం ముదిరిపోద్ది. సేతులు కాలాకా ఆకులు పట్టుకుంటే యేంలాభంలేదు ఇక మీ యిష్టంసార్.

నాగ :- ఓ! మొద్దవతారం నీది వట్టి మట్టిబుర్రయ్యా. ఆడోళ్ళనిసూసి గజగజలాడుతావేటి. అయినా ఆళ్ళు మన్నేంసెయ్యగలరయ్యా! అందరిని కట్టకట్టుకుని గంగలో దిగమను.

అవ :- యస్సూ ! ఆయినా ఆళ్ళెందుకు గంగలో దిగుతారండి. మన పార్టీవోళ్ళందర్ని కట్టకట్టి గంగలో దింపేటట్లు కనబడుతున్నారు సార్.

నాగ :- అయితే యిప్పుడేంసెయ్యాలో సెప్పేదవయ్యా !

అవ :- యస్సార్! సెప్పడానికేటిగాని సార్ - ఆ యస్సైలకాత్తా. మూసేటట్టు సేసెయ్యాలిసార్. దెబ్బతో అందరికిరోగం వదిలిపోద్ది.

నాగ :- అదెంతసేవయ్యా సిటికెలోకానిద్దాం. ఇక దానికేటిగాని ఆ రంగమ్మ సిత్తు సంగతేటిసేసావయ్యా!

అవ :- సెయ్యడానికేటండీ. అన్ని ఎప్పుడో సెటిల్ సేయించేశానండి. అయినా యిలాటి యిసయాల్లో మనం సాలా పెసఫెట్టుకదాసార్.

(ఇంతలో తలుపుచప్పుడు - నాగరాజుగారు - నాగరాజుగారూ - నాగరాజుగారు - నాగరాజుగారూ)

నాగ :- ఒకటే అరుత్తున్నారెవరో, తలుపుతీసి సూడవయ్యా!

అవ :- యస్సార్! అలాగె సూత్తా సార్.

(అవతారం తలుపుదగ్గరకెళ్ళి తలుపుతీసి తొంగిచూస్తాడు రైతుభార్య రంగమ్మ అతన్ని తోసుకుంటూ లోపలికొచ్చేస్తుంది.)

అవ :- ఏటి సెప్పుతుంటే నీకాదు. మొగోణ్ణితోసుకు లోపలికొచ్చేత్తావేటి? నిన్నే ఆగు - ఆగు

రంగమ్మ :- పెద్ద మొగోడివి బయలుదేరినావు తప్పుకో -

అవ :- ఆగు - ఆగు

రంగమ్మ :- ఇకూరుకోవయ్యా ఊరకుక్కలా ఒకటే అరుత్తావేటి? (నాగరాజును సమీపించి) దండాలుదొర! - దండాలు

నాగ :- ఏటి రంగమ్మా - ఏటి యిలావొచ్చావేటి?

రంగ :- ఆకేటిసెయ్యంబాబు, ఈ అన్యాయంయేటిబాబు నువ్వేసెప్పు?

నాగ :- అన్యాయంయేటి రంగమ్మోయ్ ఏటో పెద్దపెద్దమాటలు నేర్చేసినట్టున్నావ్.

రంగ :- పెద్దపెద్దమాటలు మాకెట్టా వొత్తాయిబాబు. ఈ యేడు పంట సేతికి బాగానే వత్తాదనుకున్నామయ్యా మాయదారివానలొచ్చి పంటవి నాసనం సేసింది

గదయ్యా ! మీరు మంచున్నపాటున డబ్బంతా కట్టమంటే ఎట్టా యివ్వగలం దొర కాసంత కనికరించాలిదొర

నాగ :-అదేటి రంగమ్మా అలాగంటావు. ఇన్నాళ్ళు కనికరంతో సూడలేదంటావేటి ?

రంగ :- అదికాదుబాబు అదికాదు మా మావ దూరంపోయిండు మీరు అన్యాయంగా మాకున్న ఒక్కఆవుని లాక్కుపోతే మేమెట్టా బతకాలిదొర మేమెట్టాబతకాలి కాత్త దయసూడుదొర - దయసూడు

నాగ :- (వెటకారంగా నవ్వుతూ) అదేటిరంగమ్మా ! అట్టాగంటావు ? కనికరించేగదా నా బూమి మిమ్మల్ని సేసుకోమని యిచ్చినా. మీరు సిత్తు ఇవ్వకపోతే నా నా సంసారం ఎట్టాగడుత్తుందనుకున్నావు. ఒకేళ నువ్వు ఆవుని అమ్మేసు కున్నావనుకో నాడబ్బు ఎలా కడతావు ? అందుకనే ముందుజాగ్రత్తరంగమ్మా! ముందుజాగ్రత్త

రంగ :- మీయసుంటోళ్ళు దయసూపకపోతే మేమట్టాబతకాలిదొరా ! మేమెట్టాబతకాలి

నాగ :- ఆదేంటిరంగమ్మా ! అట్లాగంటావు ? నేను మంచోణ్ణి కనక సరిపడింది లేకపోతే నీ యిల్లే యేలం యేయించేవోణ్ణి తెలుసా ?

రంగ :- బాబూ పదిమందికి అన్నంపెట్టవలసినోళ్ళు మీరే యిట్టా మాటాడితే మేమేం సేసేదిబాబు. మా మావ రాగానే మీ డబ్బుమీకు కట్టేత్తాము. ఆ! ఆవు లేకపోతే నా బిడ్డకు పాలుండవుబాబు. పేనంకంటె మిన్నగా సూసుకుంటు న్నాము నా సంటిబిడ్డ మొకమేనసూసి దయసూడుదొరా ! దయసూడు

నాగ :- ఆ - ఆ దయసూపడమేటి రంగమ్మా - పెద్ద యిసయాలు మాట్టాదేతున్నావేటి ఆ డాక్టరమ్మకాడ టైనింగేటి ?

రంగ :- అ డాట్టరమ్మ యేటిసేసినాది దొరా ! ఆకలితో కడుపు మండుతుంటె దయ సూపమంటున్నబాబు అంతే.

నాగ :- నన్నేటి సెయ్యమన్నావు ఎళ్ళి ఆ సీతమ్మనే ఆడుగు ఇక నీతో వాగటానికి నాకు టైము లేదుగాని ఇకెళ్ళిరా ? ఇకెళ్ళిరా !

రంగ :- మీరే అట్టా అంటే యెలాబాబు మీ పాదాలు పట్టుకుంటాను. మా మావ వచ్చే వరకు ఆగండిబాబు నా ఆవునినాకిప్పింసేయండిదొరా! (పాదాలుపట్టుకొనును)

నాగ :- (కాలితో తీసేస్తూ) ఛీ! ఛీ! సిగ్గులేనిమనిషి వట్టి మొండిగటం. అవతారం ఇలాటోళ్ళని లోపలికి రానీయొద్దని నీకెన్నిసార్లు సెప్పినానయ్యా వట్టి మందమతివయ్యా?

అవ :- యస్సూ! సెప్పినారుసార్. కాని యేటోనండి యేదో శానా యింపార్టెంటు పనేమోననుకున్నా. అయినా నన్ను తోసుకొని ఆమె వచ్చేసిందికథాసార్. ఇకమీద యేర్ని రానీయనండి.

రంగ :- అలా అనకు దొరా! నువ్వే మా పాలిటి దేవుడివి ఆ దేవుడెక్కడున్నాడో కనపడదుకాని మీలాటోళ్ళే మమ్మల్ని కనికరించాలిదొరా - కనికరింసాలి,

నాగ :- అవతారం సవటముకం యేసుకొని యింకా అలా సూత్తావేటయ్యా! అవతలికి గెంటెయ్యక

అవ :- యస్సూ! అదెంతసేపండా! నిమిసంలో గెంటెయ్యనండి. ఇదిగో! ఇదిగో (అంటూ రంగమ్మమీదికి పోవును, ఆమెను చూడగానె కాస్తభయపడుతున్నా) ఇంకా నుంసున్నావేటి? నీక్కాదేటి సెపుతోంటే మెడమీద సెయ్యేసి గెంటేత్తా జాగ్రత్త

రంగ :- (కోపంతో అవతారంమీదికొస్తూ) ఏం? అవతారం గెంటుతావా! రా! గెంటు దగ్గరకొచ్చావో నీ పాణం తీస్తా! ఒటమకున్నావ్! బతిమాలినకొద్దీ నెత్తికెక్కుతున్నావు. మునపటి అమాయకపజలం కాదు మేము!

అవ :- పెద్ద తెలివైనదానివి బయలుదేరావు. ఎంసేత్తావేటి? (అని మీదిమీదికెళ్ళును)

రంగ :- ఏం సేత్తానా! జైల్లో పెట్టించేత్తాను. నీవు నీదొరచేసే దొంగపనులు మాకు తెలీవనుకోకు! పోయనేడాది సేలోగింజలు మాపేళ ఎత్తించుకు పోతూంటో సూడలేదనుకోక. మాలాటి పేదోళ్ళమంతా ఏకమై ఎదురుతిరిగితే మీలాటోళ్ళు సేసేదేమీలేదు. గద్దెలు దిగవలసిందే. ఛీ! ఛీ! మీలాటోళ్ళతో మాడాడితేనే

పాపం సుట్టుకుంటాది. త్పూ - త్పూ - మీఅంతు సూడకపోతే నాపేరు రంగమ్మేకాదు. ఇకొత్తా.

(రంగమ్మ వెడలిపోవును)

నాగ :- (తేరుకొని) ఛీ ! ఛీ ! అవతారం నీకసలు బుద్ధిలేదయ్యా ! ఆడవట్టా నోటి కొచ్చినట్టు కూత్తూంటే సయించి ఎట్టా వూరుకున్నావయ్యా !

అవ :- యసూ్ప! అదేనాకుశానా సిత్రంగావున్నాదిసార్. మిమ్మల్ని ఆమె అట్టా తిడుతూవుంటే మీరలా రాయిలా అయిపోయినారేటాని.

నాగ :- అమ్మమ్మా ? ఎంత లేసిమాట లందయ్యా ! దాని మొగుడురాని దాని సెమ్మం వొలిపించేత్తాను. ఈసారినించి ఆడోళ్ళని యిలా వొదిలెయ్య కూడేదయ్యా, నాలిక సీల్చేయవలసిందే. తగిన జాగతలోవుండు. ఎవరేన పిలిత్తే సూసి మరీ తలుపుతియ్యి. ఆడోళ్ళయితే అసలు తలుపుతీయ్యక.

అవ :- యాసూ్ప ! దాని కేటికానీండిసార్ - దాని మొగుడు మాత్రందాన్ని యేటి సెయ్యగలడండి మీరే గుడ్లు తేలేసినారు. అసలధి కిందటిజన్మలో ఏరాక్షసో అయి వుంటదండి.

(ఇంతలో మళ్ళీ తలుపు చప్పుడు, తెరలో మళ్ళీ పిలుపులు నాగరాజుగారూ ! నాగరాజుగారూ ! )

అవ :- అ - అ - ఆడోళ్ళ గొంతుకులాగే వున్నాదండి. ఇప్పుడేటి సెయ్యమన్నారు ?

నాగ :- ఆడోళ్ళదేనంటావా ! అయితే తలుపు తియ్యకు.

(తెరలో నాగరాజుగారూ !)

అవ :- తలుపు తియ్యకపోతే ఎట్టాగండి తలుపులిరిగి మీద పడిపోతాయండి. పైగా సెవులుకోసిన మేకల్లా ఓటే అరిసేత్తున్నారండి. ఊళోవున్న ఆడోళ్ళంతా వొచ్చేసి నట్టున్నారండి.

నాగ :- తలుపులు తియ్యకపోతే నిజంగానె యిరిగిపోతాయంటావేటి ?

అవ :- యాసూ్ప ! ఇరగడం కాయం.

నాగ :- అయితే ఒకపనిసెయ్యి. తలుపుతీసి నేను లేనని సెప్పెయ్యి. తెల్సిందా ?

అవ :- యస్సూ ! అలాగే సెప్పేత్తాసార్.

(అవతారం గబగబావెళ్ళి - మళ్ళీ పరుగెత్తుతూ తిరిగి వస్తాడు)

అయ్యబాబోయ్. తలుపు తీశానోలేదోనండి నన్ను తోసేసుకు లోపలికొచ్చేత్తు రండి. ఇప్పుడేటి సెయ్యడమండే.

నాగ ,- రాని ! రాన్ని ; ఆళ్ళఅంతు తేలుత్తా. ఈ నాగరాజంటే యేటనుకున్నారో ? (మీసాలు తిప్పు కొనుచు.)

(నలుగు రాడవాళ్ళతో సీతప్రవేశం)

సీత :- నమస్కారం నాగరాజుగారు నమస్కారం.

నాగ :- నమస్కారం - నమస్కారం. ఏటమ్మా యిట్టావచ్చినావు ? నువ్వు నాయుడు కూతురు సీతవుకదూ !

సీత :- అవునండి..

నాగ :- ఏటి డాట్రమ్మా ! ఈ యిలేజీలో పాట్టీసు పెట్టెసినావట. ఎట్టాసాగుతుందేటి ?

సీత :- సాగడానికేముందండి బాగానేవుంది.

నాగ :- అన్ని మంచి పిటీలుండగా ఈయిలేజీ ఎలానచ్చిందమ్మా నీకు ? సూడబోతే కనీసం ఒక సినిమాటాకీసేనాలేదు. సీరకొనుక్కోడాన్నికేన ఓమంచి సాపు లేదు. ఇక వర్సాకాలం వొచ్చిందా ! నేలమీద కాలుపెడితే దిగబడవలసిందే. ఎంత లాక్కున్నా మరి పైకిరాదు. ఏటంటావ్ అవతారం:

అవ :- యస్సూ, నేనేటంటానండి. తమరిమాటే కరట్టండి.

సీత :- అదేమిటి నాగరాజుగారూ. కొత్త దానికి చెప్పినట్టు నాకలా చెబుతున్నారు. నేనుపుట్టి పెరిగినగడ్డ యిదేకదా ? ఇక్కడనాకు తెలీని విషయాలేమీలేవు ? తోటి మనుష్యులకు సహకరించని మనచదువులు వ్యర్థమనిపిస్తుంది, నాకు.

మొ.స్త్రీ :- బాబూ రెక్కాడితేతిని డొక్కాడని మేము పగలల్లా కట్టించి నాలుగు

రూకలు సంపాదించి యేంలబంభాబూ పసిగుడ్డు ఆకలితో మెలికలు తిరుగు తూంటే పస్తైడన్నాం వొండిపెట్టలేని మా బతుకులేటికిబాబూ? నిన్న మాప టేల బియ్యం వొరక్కా మీ రేసనుసాపుకొచ్చి కొనక్కుపోయాను బియ్యం. ఇవి బియ్యమో రాళ్ళో మీరే సెప్పండి (సంచిలోని బియ్యం చేతిలోకి తీసి చూపించును.)

నాగ :- ఇవి బియ్యమే. కళ్ళు కనపడ్డంలేదేటి. కొత్తబియ్యంలో రాల్లు ఎక్కువగా వుంటే యేంసేత్తాం. కన్నకూతురికి సక్కదనంలేదని అవతల పారేత్తామేటి? ఇది అట్టాగె. మీ ఆడోళ్ళకి బియ్యంలో రాళ్ళు ఏరుకోడం సేతకాకపోతేనేనేటి సేసేది. పైనుంచి బియ్యం అలా వొత్తున్నాయి. నన్నేటి సెయ్యమన్నావు సెప్పూ!

రెండ. స్త్రీ :- బాబూ! నాగరాజుగారూ! మా పేదోళ్ళని కనికరించాలి. మీలాటి పెద్దలే యిట్టాటి అన్నాయాలు సేత్తుంటే మే మెట్టాబతకాలి, కిలోబియ్యంలో సగం రాల్లు కలిపితే మే మేటితిని బతకాలి.

నాగ :- నే నేమి సేశానని ఆట్టా గోలసేత్తున్నారు. పోనీకదాఅని కట్టపడి రేసనుసాపు పెట్టించినా. మీకసలు యిస్వాసంలేదు. ధాన్యం పండేది మట్టిలోనేకదా! అందుకని కొత్త రాల్లు ఎక్కువున్నాయి. అదీ తెలీకపోతేయెట్లా. మాలాటోళ్ళు సెప్పింది యినుకోవాలి. ఆడోళ్ళమని సిగ్గులేకుండా తగుదునమ్మా అంటూ బయలుదేరివచ్చినారు. పోనీకదా ఆడోళ్ళని వూరుకుంటూంటే నెత్తికెక్కేత్తున్నారు.

సీత :- నాగరాజుగారూ! రేషనుషాపులు పెట్టడం పెద్ద ఘనకార్యంలా చెప్పుకుంటున్నారు. అది మీ లాభంకోసమేకదా. మన గ్రామంచుట్టూ అన్నీ వరిచేలే. ఊరునిండా అందరూ వ్యవసాయదారులే. కాని కొనటానికి బియ్యంలేవు. తినటానికి తిండిలేదు. ఉన్న రేషనుషాపు మీ స్వాధీనంలోవుంది. ఇవి బియ్యమో రాళ్ళో సరిగా చూడండి. ఇటువంటి అత్యాచారాలు ఇకముందుసాగటానికి వీల్లేదు.

నాగ :- సీతమ్మా! నీకు శానా సిన్నతనం. అయినా ఈ సిక్కులన్నీ నీకేటితెలుత్తాయి.

నీ పాట్టేసుసంగతి నువ్వు సూసుకో.

సీత :- నాగరాజుగారూ ! నా ప్రాక్టీసుసంగతి నాకు బాగాతెలుసు మీ నక్కవినయాలు నాదగ్గర కాదు.

నాగ :- ఏటి డాట్టరమ్మా ! యేటి మాట్టాడుతున్నావు గుడ్డొచ్చి పిల్లని యెక్కిరించిందంట. ఈ యిలేజికి ఏభై యేళ్ళనుంచి సేవసేత్తున్నా. అలా అంటావేటి. నలుగురుయింటే నవ్విపోతారు. నన్నుగురించి యింకా నీకు బాగా తెలిసినట్టులేదు.

మొ.స్త్రీ :- తెలీకేం బాబూ బాగా తెలుసు. నిన్నుగురించి చెప్పడం దేనికిబాబూ.

సీత :- మీనక్క వినయాలు మాదగ్గరకావు. గ్రామపెద్దల పేరుతో లక్షాధికారులయ్యారు దేవుడి చేలన్నీ స్వతం చేసుకుని అనుభవిస్తున్నారు. గవర్నమెంటు హాస్పటల్లోని మందులన్నీ బ్లాకులో అమ్మి డబ్బు చేసుకుంటున్నారు. ఇప్పటికే మీసంగతి అందరికీ తెలిసిపోయింది.

మొ.స్త్రీ :- ఇన్నీ సాలక పేదోళ్ళ పొట్టలుకొట్టి రేషను దోచుకుని అమ్ముకునేది మీరు కాదా బాబూ —

రెం.స్త్రీ :- సందాల పేరుతో డబ్బు పోగుసేసి పెళ్ళానికి బంగారు పూత పూయించేది మీరు కాదా !

మూ.స్త్రీ :- వడ్డీలకు వడ్డీలుకట్టి సదువురానోళ్ళసేత యేలిముద్దర్లు కొట్టించేసి ఇళ్ళు ఆకిళ్ళు రాయించుకొనేది మీరుకాదా !

సీత :- చూశారా నాగరాజుగారూ ! వాళ్ళకికూడా మీసంగతి యెలా తెలిసిపోయిందో. ఇంక నీతులు మాట్లాడకండి. మేమంతా ఏకమైతే మీరు ఏమిచేయ్యగలరో జాగ్రత్తగా ఆలోచించుకోండి.

నాగ :- ఓహో ? నీవేనన్నమాట. ఇట్టాటి అమాయిక పజలందర్నీ రెచ్చగొట్టి వీధికెక్కించేది. కోరినాతో యెందుకు యిరోదం తెచ్చుకుంటున్నావో నాకర్థం కాటంలేదు. అయినా మీనాయన మొహంచూసి వూరుకున్నా తెలిసిందా యిసయం.

సీతా :- నాకు నీవిషయం ఎప్పుడో తెలిసింది. ఊరుకోక మీరిప్పుడేమి చెయ్యగలరు.

ప్రజల్లోవుండే మంచితనాన్ని, అమాయికత్వాన్ని ఆసరాగా తీసుకొని యిష్ట మొచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. మేం తలచుకుంటే యేదైన చెయ్యగలం. ఇకముందు మీఆటలు సాగవు.

మొ.స్త్రీ :- అవును యింక మీఆదికారం సెల్లదు.

రెం.స్త్రీ :- ఇక మీ అన్యాయాలు సయించం.

మూ.స్త్రీ :- ఇక మీ అత్యాచారాలు సాగవు.

సీత :- షూశారా ! నాగరాజుగారూ - ఇక ఎవరు జాగ్రత్తగా వుండాలో మీరే ఆలో ించండి.

నాగ :- ఏం ? డాక్టరమ్మా ! బెదిరిస్తున్నావేటి ? నన్ను బెదిరించి యీపూళ్ళో పాట్టీసుపెట్టి ఎట్టావుంటావో నేనూ సూత్తా. ఈనాగరాజు కింతవరకు తిరుగు లేదు. పగబడితే కాటేసి తీరవలసిందే.

సీత :- ఏం బెదిరిస్తున్నారా ! నాగరాజు బెదిరింపులకు భయపడటానికి మేము కప్పలం కాదు. సమయంచూసి నాగరాజును ఎలా పట్టుకోవాలో మాకు బాగా తెలుసు.

నాగ :- ఆవతారం - యింకా అట్టా గుడ్లు మెటకరించి సూత్తావేటి. బయటకు నెట్టేసెయ్యి.

అవ :- యస్సూ - అలాగేనండి సార్. (కాస్త వారికి దగ్గరగావెళ్ళి మళ్ళీవెనక్కు వచ్చి కాస్త భయపడుతూ.) ఆదేనండి, ఎట్టా గెంటాలాని సూత్తున్నానండి అంతే.

సీత :- ఇద్దరూ చూస్తూ వుండండి. మేం వెళ్ళొస్తాం.

అవ :- ఇకరాకండి. ఎల్లండి - ఎల్లండి.

మొ.స్త్రీ :- ఎల్తాం - ఎల్తాం, మళ్ళీవొచ్చి మీ యిద్దరిపనీ పడతాం,

రెం.స్త్రీ :- సిగ్గులేని మడుసులు - సిగ్గులేని మడుసులాని. యెట్టాపుట్టినారో యేమో - రాచ్చసోళ్ళు.

మూ.స్త్రీ :- త్తూ - త్తూ - సిగ్గులేనోళ్ళు, ఇంకెన్నాళ్ళో సూత్తావుండండి.

(అందరూ వెళ్ళుదురు.)

నాగ :- (కుర్చీలోంచి లేచి అటూ ఇటూ పచార్లు చేస్తూ.) ఛీ ! ఛీ !! ఈళ్ళసలు ఆడోళ్ళే నా అని.

అవ :- అమ్మయ్యా! పీడాపోయినాది. ఈళ్ళమాటలింటుంటే మన్సెమటలు పోసేసి నాయనుకోండి.

నాగ :- ఏడిశావు లేవయ్యా. కాస్త నోరుమూసుకొని మరీ ఆలోసించు, పనికిరాని కబుర్లు సెప్పబోక.

అవ :- యస్సా! అంతేసార్ ఆ. అది కాదండీ పాయింటూ. నోరు మూసుకొని ఆలోసిత్తే యేటి తెలుస్తాదండీ!

నాగ :- ఓ! మొద్దవతారం! అసలు నువ్వు నాకాడికి వొచ్చింది మొదలు అన్నీ గొడవలేనయ్యా. అసలు నిన్ను డిసిమిస్ చేసేత్తే గొడవవొదిలిపోద్ది!

అవ :- యస్సా! అంతేసార్, అమ్మయ్యో! అట్టాగంటె యట్టాసార్. మీకాడ బతుకుతున్నా. అసలుసంగతి సెప్పండి యింక.

నాగ :- నీతో నాకు సావొచ్చి పడ్డదయ్యా! అదే ఆ ఆడోళ్ళని ఎట్టా లొంగదీయటమా అని. ఈళ్ళు డబ్బుకు లొంగరు, మందుకు లొంగరు. రికమండేసనుకీ లొంగరు. ఇక బయపెడితే మరీ రెచ్చిపోయి గంతులే యేస్తున్నారు. ఇకేటి సెయ్యాలా అని.

అవ :- యస్సా! అదెంతసేపండీ మీరు వూ అనండి సిటికెలో సేయింసేత్తాను? మన పాత పద్ధతి ప్రకారంగా రాత్రికి రాత్రి సఫా సేయింసేయ మన్నారేంటి మన పాతకాంటాక్టరుని పనేంలేకసూత్తున్నాడండి.

నాగ :- అది సేనా దేంజరు అవతారం! నీకస్సలు బుర్ర లేదయ్యా! పైన వట్టిమట్టిబుర్ర కూడాను. అసలే గవర్నమెంటోళ్ళు ఈ ఆడోళ్ళ మీద ఓ కన్నేసి వుంచినా రంట. పైగా యిది అంతర్జాతీయ మహిళా సంవత్సరమట కూడా! అసలికే మోసంవత్తాది · అయినా యీ ఆడోళ్ళకి పదవు లొచ్చినాక మరీ బరి తెగించి పోయినారయ్యా. మొగోళ్ళని కొంచెంకూడా బయం లేకుండా యిట్టా యెదురిం సేత్తున్నారు.

అవ :- యస్సా అంతేనండీ! అయినా ఈ రోజు లేచిన యేళ బాగాలేదండి సార్.

నాగ :- యేడిశావు లేవయ్యా! అసలే బుర్ర శానాయేడెక్కి పోయి నేనుంటే యింకా యేడెక్కింసేత్తావేటి?

అవ :- యస్సూ! అమ్మమ్మ నేనుఏడ్కెకింసేయడం యేటండి!

నాగ :- నీ యస్సు కూలా - నా పాణం లాగెస్తున్నావయ్యా!

(ఇంతలో నాగరాజు భార్య ప్రవేశం. విపరీతమైనలావు. ఒంటినిండా వస్తువులు ధరించి వుంటుంది.)

భార్య :- ఏవండీ! ఏవండీ! ఎక్కడున్నారండీ.

అవ :- అమ్మగారెటోయెల్లి యీడకేవస్తున్నారండి.

నాగ :- ఆయిడగారు యేడకి తగలడితే మనకెందుగ్గాని నువ్వెళ్ళి కాత్ర వూళ్ళో యిసే సాలు కనుక్కొని వెంటనే వచ్చేసెయ్యి. అంతవరకూ నా పాణం కుతకుత లాడుతూ వుంటుంది. ఇకెళ్ళిరా

అవ :- యస్సూ! అలాగెనండిసార్.

నాగ :- నీ అండిసారు మండిపోను నా ఒళ్ళు మంటలెక్కిం సేత్తునావయ్యా!

అవ :- యస్సూ అంతేసార్ — ఇకెళ్ళొత్తా.

నాగ :- యస్సూ.

భార్య :- ఏవండీ అప్పటినుంచి యిక్కడేకూర్చుని యేంచేస్తున్నారండీ

నాగ :- నే నేటిసేత్తే నీకెందుకూఅంట. అసలిలాటి యిసయాలన్నీ నన్నుడగొద్దని నీకెన్నిసార్లు సెప్పినా. ఒక్కసారి సెప్పితే యినుకోవాలి. (భార్యను పరిశీలించిచూసి) అన్నట్టు యేటీ ఈ యేసం. ఇయన్ని సింగారించుకుని యేడికి బయలుదేరావ్.

భార్య :- ఎక్కడికేమిటండీ మన ఆఫీసరుగారింటికండీ, వాళ్ళబ్బాయిది పుట్టినరోజు. అందుకని పేరంటానికెళ్ళానండి.

నాగ :- ఆడి పుట్టినరోజుకాదే, ఈయెల నా సచ్చినరోజులాగుంది. ఇదంతా నా కర్మే.

భార్య :- అదేమిటండీ! సుభమాని పేరంటానికెడితే అలాటిమాటలంటారేమిటండీ. అయినా రోజురోజుకీ మీ రిలా అయిపోతున్నారేమిటండి. అసలీ అవతారం వచ్చిందిమొదలు మీరు మరీ పాడైపోయినారండీ.

నాగ :- అవతారంగాడికేటిగాని నాతో సెప్పకుండా యినప్పెట్టిలోనుంచి యీ నగలన్నీ యెందుకుతీశావూఅంట.

భార్య :- అదేమిటండీ అలాఅంటారూ ? పెద్దవాళ్ళింటికి వెళ్ళేటప్పుడుకూడా పెట్టుకోకపోతే ఎలాగండీ ! అందరూ లోకువచెయ్యరూ !

నాగ :- లోకువసెయ్యటంకాదే యీా ఆఫీసరుగాడు నన్ను జైలుకే పంపేత్తాడే. అయినా ఆ ఆఫీసరుగాడింటికి వెళ్ళొద్దని నీ కేన్నిసార్లుసెప్పినా. ఇంతకీ యియన్నీ సేయించడం నాదేతప్పు.

భార్య :- అయ్యో : అయ్యో ! అవేంమాటలండీ ! సరదాపడి చేయించుకోడం పెట్టుకోడానికే కదండీ. వాళ్ళంతా నన్నుచూసి ఎంతగౌరవించారనుకుంటున్నారు. చక్కగా దగ్గర కూర్చుని ఒక్కొక్క నగ ఎంతబరువున్నదీ, యెప్పుడెప్పుడు చేయించింది అన్నీ వివరంగా అడిగారండీ, అన్ని చెప్పేశాను. నాకన్నీ కంఠోపాఠమేకధండీ !

నాగ :- ఆ — ఆ — ఎంతపనిచేశావే నా కొంపముంచావుకదే ! ఇంకా యేం సెప్పి యేడిశావే ? _

భార్య :- చెప్పి యేడవడం దేనికండీ, అందరూ ఎంతోసరదాగా వున్నారంటే నమ్మండి. పైగా మనబ్బాయికి ఒకలక్ష కట్నంతో పెండ్లి కుదిరిందనిచెప్పి పెండ్లికి కూడా యిప్పుడే పిలిచేశానండీ !

నాగ :- ఆ - ఆ - ఎంతపని సేసినావే: ఇంకా యేంసెప్పి యేడిసినావే !

భార్య :- ఏడవడం నాకు చేతకాదండోయ్. హాయిగా నవ్వుకుంటూ హైదరాబాదులో నాల్గు లక్షలెట్టి మనంకట్టే బిల్డింగు గృహప్రవేశానికి కూడా యిప్పుడే పిలిచి మరి వొచ్చేశానండీ, అంతా తప్పక వస్తామన్నారండీ.

నాగ -: (నెత్తిన చేతుయి పెట్టుకుని యేడుపుకంఠంతో) ఎంతపని సేసినావే. నాకొంప ముంచేసినావుగదే. అళ్ళు కావాలనే అడుగుతూంటే నాగుట్టు బయటపెట్టేసినావుగదే !

భార్య :- గుట్టేమిటండీ ! మీరుచెప్పేది నాకర్థం కావడంలేదండీ !

నాగ ;- సీ ! సీ ! మొద్దవతారమాని వట్టి దద్దోజనం మనిషివి. ఆ యినయాలన్నీ నీకాడ కూకుని ఎందు కడిగినారను కుంటున్నావు ? నీమీద ఆపేక్ష, ప్రేమాకాదే ! మనఆస్తి కనుక్కుని మన్ని జైల్లో పెట్టింసేత్తారు, సీ ! సీ ! నాయెదురుగా

వుండబోక. గంగిరెడ్డులా ముత్తాబై నన్ను నాశనం సేసేసినావు. ఎదవ గంగిరెడ్డాని గంగిరెడ్డు యేసంమాని అసలీ ఆడోళ్ళతోటే వత్తాయి తంటాలన్నీను. సీ! సీ! లోపలికెళ్ళిక.

భార్య :- (ఏడుపు గొంతుగతో) నేనేం సేశానని యిప్పుడిలా తిడుతున్నారు. అసలు మీకు నామొహంచూస్తేనే కోపం. అవతారంగాడుంటేసాలు మీకు, నేపోతా లెండి (విసవిసా నడుత్తూ లోపలికెళ్ళిపోవును. పరుగెత్తుతూ అవతారం ప్రవేశం).

అవ :- (వగర్చుచు) కొంపమునిగిపోయినాది సార్, కొంప మునిగిపోయినాది.

నాగ :- అసలు సంగతేదో సెప్పిఏడవక యీ అరుపులేటికయ్యా ?

అవ :- ఇంకేమున్నదిసార్ సెప్పడానికి. ఈళ్ళు ఆడోళ్ళుకాదండీ. దెయ్యాలు - భూతాలు - పిశాచాలు - శాకినీలు - డాకినీలు,

నాగ :- నీగొంతుకోయ్యా! దెయ్యాలేటి భూతాలేటయ్యా! అసలు సంగతేదో సెప్పిసావయ్యా!

అవ :- యస్సా! అట్టాగె సెప్టిత్తా కానీండీ. మనింటికొచ్చిన ఆ డాట్టరమ్మ సీతమ్మ లేదండీ!

నాగ :- అవును వుందికదా ?

అవ :- ఆదేనండీ. మనూళ్ళోని అడోళ్ళనందర్నీ యెంటబెట్టుకుని వట్టంనుంచి పోలీసోళ్ళని పిలిసేసినాదండీ. ఇంకేమున్నదండీ? ఆరు పెద్ద పెద్ద యాన్లలో దిగిపోయినారుసార్. బాబోయ్. ఇకేటున్నదండోయ్ (భయం నటించవలెను.)

నాగ :- దిగి యేం సేశారేంటి ? మద్దెనువ్వు గజగజలాడి పోతావేటీ!

అవ :- ఇంకేటి సెయ్యమన్నారు, ఆళ్ళనిసూత్తే మీరే పూనకంవోళ్ళా వొణికిపోయేవోరు. ఆ పోలీసోళ్ళు మన దాన్యం గొడాములన్నీ లాక్ సేసేసినారు, రేసను సాపు పోలీసోళ్ళ స్వాధీనం అయిపోయినాదండి. దేవునిసేలోవున్న మన పసువులన్నిటిని కట్టేసినార్ సార్. ఇప్పుడేటి సెయ్యాలండోయ్.

నాగ :- (భయంతో వణుకుతూ కండువాతో పట్టినచెమటలు తుడుచుకుంటూ) యేటి యిదంతా నిజమేనేటి? మనోళ్ళంతా యేడ దిగబడ్డారేటి ?

ఆవ :- ఇంకెక్కడి మనోళ్ళండి ! ఆళ్ళందర్ని అరెట్టుసేసి లారీ లెక్కించుకుని లాక్కుపోతున్నారండి. రోజూ మనచుట్టూ తిరిగేవాళ్ళే మనగుట్టు ఆరికి సెప్పేసి నారండి.

నాగ :- అలాగని ముందే సెప్పరాదయ్యా ? ఇంతకీ మనకి దారి యేటిప్పుడూ ! అదేదో సెప్పి యేడవరాదూ ?

అవ :- యస్సూ - సెప్పే యేడుత్తాకాని. ఇంకేటిదారండీ ! అగోదారేనండీ. అయినా ఆగోదావరిలో దిగాలంటే మీకుశానా బయంకదండీ. పారిపోదామంటే యింటి సుట్టూ పోలీసులున్నారండి. అందుకని అటకెక్కి దాగుందామండి. నడవండి.

(తెరలో)

(నాగరాజుగారూ ! నాగరాజుగారూ ?)

ఆవ :- యస్సూ వచ్చేశారు సార్. బాబోయ్ వచ్చేశారండోయ్. నడవండి పారిపోదాం సార్ !

నాగ :- నడవయ్యా ! బాబూ ? నడూ ?

సీత :- నాగరాజుగారూ ! నాగరాజుగారూ.

భార్య :- (తలుపుతీసి) ఎవరూ డాక్టరమ్మేనా ? ఏమ్మా యిలావచ్చావూ (అటు ఇటు ఆ - ఆ - ఇదేమిటమ్మోయ్. పోలీసుల్నికూడా తీసుకొచ్చావు. ఇదేమిటమ్మోయ్.

సీత :- మీరేం భయపడకండి. మిమ్మల్లేమి చెయ్యరు నాగరాజుగా రెక్కడున్నారో చెప్పండిచాలు,

భార్య :- నాగరాజుగా రెందుకమ్మా ! నాకేదో భయంగావుంది. నువ్వేనా నిజంచెప్పుతల్లీ!

సీత :- నిజం చెప్పడానికేముందమ్మా ? నాగరాజుగారిలాంటి సంఘ విద్రోహులకళ్ళు, తెరిపించడానికి అమాయక ప్రజల్ని ఆదుకోవాలని మేమందరంకలసి పోలీసుల్ని తీసుకొచ్చామమ్మా,

భార్య :- ఆయితే నాభర్త యెందుకమ్మా ! చెప్పూ త్వరగాచెప్పూ,

సీత :- ఆయన యెన్నో నేరాలు చేసేడమ్మా !

భార్య :- ఏమిటంటున్నావు నువ్వు నాభర్త సంఘవిద్రోహి ?

సీత :- అవునమ్మా! మీరుచాలా అమాయకులు. మీకేవిషయాలు సరీగా తెలియవు. మీ పదెకరాలు వందెకరం యెలా ఆయిందనుకుంటున్నారు ? ఇంత బంగారం డబ్బూ మీకెలావచ్చాయో తెలుసా ? ఇదంతా నీభర్తచేసే అత్యాచారం. కాదు అన్యాయం.

మొ.స్త్రీ :- నీభర్త గజదొంగ.

రెం.స్త్రీ :- నీభర్త హంతకుడు.

మూ.స్త్రీ :- నీభర్త సంఘ ద్రోహి.

సీత :- వింటున్నారా అమ్మా!

భార్య :- (భయపడుతూ) ఏమిటమ్మా యిదంతా ఎందుకిలా జరిగింది.

సీత :- జరగడానికేముందీ! అబద్ధం చెప్పవలసిన ఆవసరం మాకులేదు.

అందరూ :- అవును నిజం.

భార్య :- ఆ - ఆ. నాభర్త యిటువంటివాడని అనుకోలేదమ్మా! భర్తనేనమ్మి దేవునిలా పూజించినానమ్మా! ఎదిరిస్తే తప్పని సెప్పినదానికల్లా తలూపాను! చిన్నతనం నుంచి అబద్దాలాడే మనుష్యులంటేనే నాకుకిట్టదు, ఇప్పటికేనా నాకళ్ళు తెరిపించారమ్మా!

సీత :- ఇందాక పేరంటానికి వాళ్ళు కావాలనే మిమ్మల్ని పిలిచారమ్మా! వెనకాల టేపు రికార్డర్ పెట్టుకుని మీ మాటలన్నీ టేపు చేశారమ్మా!

భార్య :- టేపుచేశారా ? ఇటువంటి దురన్యాయాలు ఎవరుచేసినా ఒక్కటే ఇన్ని అక్రమాలకు, అన్యాయాలకు కారకుడైన నాభర్త శిక్ష అనుభవించవలసినదే. ఇనస్పెక్టరుగారు మాయిల్లంతావెదికి నాగరాజుగారు ఎక్కడున్నా పట్టుకోండి.

పో.ఇ :- నెంబరు సెవెన్ పానకాలు - నెంబరు ఏట్ వెంకయ్య - వెళ్ళండి. ఇల్లంతా వెదకండి. ఎక్కడున్నా అరెస్టుచేసి ఇద్దర్నీ తీసుకురండి.

పానకాలు వెం :- యస్. సార్.

(పోలీసులు యింట్లోకివెళ్ళి నాగరాజును, అవతారాన్ని ఆరెస్టుచేసి తీసుకు వస్తారు. నాగరాజు, అవతారం తలొంచుకు నిలబడుతారు.

భార్య :- (వారికి దగ్గరగావెళ్ళి) ఏమండీ. ఈ అవతారంగాడితో యిరవై నాలుగు గంటలూ చెవులు కొరుక్కుంటూ కూర్చునిచేసిన ఘనకార్యాలు యివిటండీ. ఇలాటి పనులన్నీ చెయ్యాలన్న బుద్ధి మీకెలాపుట్టిందండీ. అసలీ అవతారంగాడివి ముందు పట్టుకుతన్నాలి.

నాగ :- అయిందా వుపన్యాసం. ఇంక నోరు మూసుకుంటావా ?

భార్య - నేను నోరుమూసుకుంటానండీ వీళ్ళందరూ నోర్లు మూసుకుంటారుటండీ.

నాగ :- ఏడిశారు.

సీత :- నాగరాజుగారూ ! చూశారా ! ఎలాజరిగిందో: నాగరాజుకి తిరుగులేదన్నారు. ఇప్పుడేం చేద్దామని. మీరు సంపాదించిందంతా మూటలూ ముళ్ళాకట్టి చుట్టూ పెట్టుకుని జైల్లో కూర్చుందామనుకున్నారా ?

రంగ :- అ - అ - కటకటాలలో కూకుంటే బాగా తెలిసొత్తాది. నాగరాజయ్యా ఇప్పుడు బాగా తెలిసిందా ? పేదపజల పొట్టలుకొట్టి తిందామంటే ఎట్టా అరుగుద్దయ్యా! సీ ! సీ ! అసలు మీలాటి పెద్దోళ్ళంతా యింతే. దేశాన్ని రెండు సేతుల్తో దోసుకు తింటమేపని.

మొ.స్త్రీ :- ఓ ! అవతారమయ్యా, బాగా తెలిసిందా ! కూకో ! జైల్లో కూకో అప్పుడింకా బాగా తెలుసొత్తాది.

రెం.స్త్రీ :- ఏటి తెలిసేది. సేసిందంతా అనుబవించవలసిందే. సిగ్గులేని మొహాలానీ ! సిగ్గులేని మొహాలు.

నాగ :- అమ్మా ! సీతమ్మా ! సచ్చిన పాములాగున్న నన్ను రాళ్లలాటి మాటలిసిరి యింకా సంపుతావేటి ? అధికారం సేతికొత్తే డబ్బు సంపాదించాలనే తప్ప మరేటి తెల్వలేదునాకు' పచ్చకామిర్లోడికి లోకమంతా పచ్చగానె కనబడతాదిట. ఇప్పటికి నాకళ్ళకు పట్టినరోగం కుదిరిపోయినాది. నామనసుకెక్కిన యిసం దిగిపోయినాది'

సీత :- నాగరాజుగారూ ! గుట్టంతా బయటపడ్డాక కళ్ళు తెరిచారు. మీలాటి స్వార్థపరులు. దేశద్రోహులు వుండబట్టే ఈదేశం యింత అవక తవకగావుంది. ఈ ప్రజల అమాయికత్వాన్ని ఆసరాగా తీసుకున్నారు. ఈఆస్తులు మీచేతులుదాటి కష్టపడే

వారి చేతులకు దక్కే వరకు మీలాటివాళ్ళు కళ్ళు తెరవరు.

భార్య :- అమ్మా ! సీతమ్మా ! అన్యాయపుసొమ్ముతో చేయించిన యీనగలన్నీ నీవుద్య మాని కిచ్చేస్తున్నాను. అష్టకష్టాలు పడుతున్న అమాయక ప్రజల్ని ఆదుకో అమ్మా.

సీత :- అమ్మా ! మీలాటి గృహిణులు స్వార్థంవదిలి ముందుకొస్తే అత్యాచారాలు, అన్యాయాలు వాటంతటవే అడుగంటిపోతాయి. చివరకు భర్తనికూడా తంచ కుండా మాకు చేయూతనిచ్చారు. నిజంగా మీనడత ఆడవారికే ఆదర్శమై నిలుస్తుంది.

నాగ :- దొట్టరమ్మా ! ఇక సెప్పాల్సింది యేటిలేదు కాని నాబదుకే నవ్వులపాలై పోయినాది. ఇక ఆస్తి యేటిలెక్కా. ఇదిగో మీ నైటుబడికి, నీఆస్పటలకి రాసి యిచ్చేత్తున్నా. పదిమందికి పనికొచ్చేపనులు నీలాటోళ్ళే సెయ్యగలరు, యేటం టావు అవతారం.

అవ :- యస్సా - అంతేసార్, మొదటినుంచి మీమాటే నామాట ఇంక యిప్పుడు యేరెందుకుసార్.

రంగ :- ఎన్నాల్టికి నీనోటమ్మట మంచిమాట యిన్నామయ్యా ! ఇక పజలు బాగు పడ్డట్టే.

మొ.స్త్రీ :- అవతారం మార్చేసినట్టున్నాడు. ఇక మరో అవతారం జైల్లో.

రెం.స్త్రీ :- ఇంకా అలా నిలబడ్డారేటి యానులెక్క ఇక కదలండి.

నాగ :- సీతమ్మా ! అసలు యిసయం ఇనుకో ! నాలోటోళ్ళు యీదేశంలో యింకా శానామందే వున్నారు. ఇంటింట, వూరూరాసేరి గొంగళీ పురుగుల్లా ఒకటేపడి తినేత్తు బలిసిపోతున్నారు. అరందర్నీకూడా ఎతికిపట్టేసి నాకాడ కూలేసెయ్యి కటకటాల్లో కూకుని మంచికబుర్లు సెప్పుకుంటాం. ఇకనడు యినస్పెక్టరుబాబూ !

భార్య :- అంతాతెలిసి మారిపోయాక మీరు జైలుకెడితే నేనెలా వుండనండీ !

నాగ :- ఎలావుండటమేటి యెర్రిదానా ! ఈ పజలంతామనోళ్ళే. ఆమాత్రం తెల్దేటి. అవతారం ఇకనడు.

ఫో.ఇ :- అమ్మా. సీతమ్మా ! మీలాటివారిముందు మా డిపార్టుమెంటే సిగ్గుపడాలి. మీరుచేసే కృషికి మాసహకారం ఎప్పుడూ వుంటుంది. శలవమ్మా ! నాగరాజు గారూ ! అవతారం నడవండి.

భార్య :- సీతమ్మా ! ఎంత తెలివైన దానవమ్మా ! మీలాటి నిజాయితీపరులు పరోప కారులు వుంటేతప్ప దేశం బాగుపడదు. నడవండి. మీతోపాటే నేనువుంటాను. ఉడతాభక్తిగా నాకు చేతనైన సహాయంచేస్తాను.

సీత :- చాలా సంతోషమమ్మా ! రంగమ్మా ! మనం చేసినకృషి ఫలించింది. ఇంతటితో ఆగకూడదు. ఇంకా కష్టపడాలి. సంఘానికి చీడపురుగుల్లాంటి దేశద్రోహుల కళ్ళు తెరిపించాలి. అన్యాయాలకు, అక్రమాలకు పుల్‌స్టాప్ పెట్టించాలి. అమాయకుల్ని తట్టి లేపాలి. ఇదే మన కర్తవ్యం.

అందరూ :- అవును ఇదే మన కర్తవ్యం.

వందేమాతరం - మందే రాజ్యం.
వందే మాతరం - మందే రాజ్యం.

# మీరు మీరు ఒక్కటే

## (ఏకాంకిక)

రచన:- డా॥ వా సా ప్రభావతి

**1972**

కాలం మారింది. మారిన కాలంతోపాటు అడుగు వేయలేని సమాజంలోఇంకా పాతపద్ధతులకు తలొంచి కొత్తపద్దతులను అంగీకరించలేక కొందరు కొట్టుమిట్టాడు తున్నారు. యువతరం ముందుకు దూసుకు వస్తోంది, పెద్దలకు మనస్తాపం కలుగుతున్నా యువతరం వారి ధ్యేయాన్ని వదిలిపెట్టకుండా అనుకున్నది సాధిస్తూనేఉంది.

మోహన్ తల్లి కాంతమ్మ కొడుక్కి పెళ్ళిచేయాలన్న వుద్దేశంతో కట్నకానుకలను సాధ్యమైనంతవరకు రాబట్టాలన్న కోరికతో పెళ్ళికూతుళ్ళను చూడటానికి బయలు దేరుతుంది. వేషం, కోరికలు అధునాతనం కాని కట్నకానుకల విషయంలో చెప్ప లేని మోజు. అందుకే ఎన్నోసంబంధాలు చెడిపోతాయి. చివరకు వీణ అనే అమ్మాయిని చూడటానికి బయలుదేరుతుంది. కొడుకును వెంటపెట్టుకుని, వీణ సాంప్రదాయ సిద్ధమైన మధ్యతరగతి కుటుంబంలోని పిల్ల, తన ద్యేయాన్ని సాధించాలనిఉన్నా తల్లిని యెదిరించలేదు. పక్కింటిపుల్లమ్మ పూర్వ సాంప్రదాయంలోఉండి మారుతున్న యువతరాన్ని చూసి సహించలేక వారిని హేళనచేస్తూ వారిని నిందిస్తూ సంతృప్తి చెందుతూ వుంటుంది. వేషభాషలలో పూర్వ సాంప్రదాయాన్ని అనుసరిస్తున్నా సమాజానికి మేలుచేసే అధునికతను కోరుకునేది అంగీకరించినది రత్తి

వీణనుచూసిన మోహన్, మొహన్‌నుచూసిన వీణ సంతోషిస్తారు, ఇరువురి మనస్సులు కలిశాయి, ఇరువురిధ్యేయాలు కలిశాయి. కాంతమ్మ కోరికలు తీర్చలేని మధ్యతరగతి సంసారములోఉన్న వీణతోకూడ తనపెళ్ళి జరిపించదని మోహన్ గ్రహిస్తాడు, అందుకే అక్కడే అప్పుడే సాహసించి యిరువురు పెళ్ళిచేసుకొని వస్తారు.

ముందు పెద్దలంతా చాలా బాధపడినా ఆ దంపతుల ధైర్యాన్ని చూరవని అందర
అంగీకరిస్తారు, వారిని ఆదరిస్తారు, అంతవరకు అభిప్రాయభేదాలతో ఉన్న ఆడ ప
పెళ్ళివారు కలిసిపోతారు.

పాత్రలు :-

1. వీణ — పెళ్ళికూతురు
2. మోహన్ — పెళ్ళికొడుకు
3. పార్వతి — పెళ్ళికూతురు తల్లి
4. కాంతం — పెండ్లికొడుకు తల్లి
5. రత్తి — పనిమనిషి
6. పుల్లమ్మ — పక్కింటి ముసలమ్మ.

ఇంటర్ కాలేజీ పోటీలలో బహుమతి గ్రహించిన నాటిక.

# 'మీరుమీరు ఒక్కటే'

## (రంగము - హాలు)

హాల్లో-టీపాయికుర్చీలు-మూలగా డ్రాయరు రేడియో మొదలైన సామా నుండ వలెను, డ్రాయరుమీద ఒక అద్దం దువ్వెన వగైరా.

(వీణ సోఫామీద కూర్చుని పేపరు చదువుతూ వుంటుంది. ఇంతలో తల్లి ప్రవేశం)

తల్లి :- వీణా! వీణా! ఇంకా అలా కూర్చున్నావేమిటే? లేచి కాస్త త్వరగా తెమలవే.

వీణ :- తెల్లారిందో లేదో! ఏమిటమ్మా గోల. ఒకటే పురాణం చదివేస్తున్నావు?

తల్లి :- అన్నీ నీకు పురాణాల్లాగె వుంటాయి, తొమ్మిది గంటలకల్లా పెళ్ళివారు వస్తా మని కబురుచేశారు. ముందా పేపరుతీసి పక్కకుపెట్టు. ఆతండ్రి ఈ కూతురు ఒక్కటేరకం, పేపరుపట్టు కూర్చుంటే పొద్దెటు పోతోందోకూడా తెలీదు.

వీణ :- అది బాగానేవుంది కాని యింతకీ నువ్వు ఎవర్నడిగి పెళ్ళివారిని రమ్మన్నావు? అందుకేనేను యిలాగే కూర్చుంటాను.

తల్లి :- ఇలాగే కూర్చుని ఎవర్ని వుద్ధరిస్తావే? అయినా నామాట వినేదెవరు, నువ్వేమొ యిలా మొండికెత్తి కూర్చున్నావు? మీనాన్నేమో దేశాలుపట్టి తిరుగుతున్నారు. మీతోవేగలేక నిజంగా ఛస్తున్నా ననుకో.

వీణ :- నువ్వు చావడం దేనికమ్మా, ఈ పెళ్ళిచూపుల్తో వేగలేక నేఛస్తుంటేను. ఇంతకీ నన్నిప్పుడేం చెయ్యమంటావు.

(అంటూ పేపరు చదవడం ఆపుచేస్తుంది.)

తల్లి :- చెయ్యడానికేముందే, పెళ్ళివారొచ్చే టైముకి కాస్తలేచి ముస్తాబైతే అంతేచాలు.

వీణ :- ప్రతీసారి ఇదోగొడవ, వాళ్ళడిగే యక్షప్రశ్నలకి సమాధానం చెప్పలేక ఛస్తు న్నాను. నేనసలు పెళ్ళేచేసుకోను. హాయిగా వుద్యోగం చేసుకుని బతుకుతాను.

తల్లి :- ఆ - ఆ - ఉద్యోగంచేసి బతుకుతావు, ఉద్యోగం చేస్తేమాత్రం పెళ్ళక్కర్లే దేమిటే, ఇంకో నాలుగేళ్ళుపోతే చెంపలు నెరుస్తాయి. అప్పుడెవ్వడూ పెళ్ళి చూపులకిరాడు తెలిసిందా!

వీణ :- మరీమంచిది, హాయిగా యిలాగేవుంటాను.

తల్లి :- చాలు ! చాలు ! ఇంక నోరుమూసుకోవే. ఎవరైనవింటే నవ్విపోతారు.

వీణ :- ఆ - నవ్వితే నవ్వని నాకేంభయమా ?

తల్లి :- నీకే భయముంటె యిలా ఎందుకుంటావే, నెత్తిమీదికిరవై యేళ్ళొచ్చాయి, నీ యీడుకి నాకు ముగ్గురుపిల్లలు పుట్టారు తెలిసిందా !

వీణ :- ఆ - ఆ - (నవ్వు.) ఇంకానయం నలుగురు పుట్టారన్నావుకాదు, మీకాలంలో పిల్లల్ని కనడంతప్ప మరేంపని లేదనుకుంటాను,

తల్లి :- అన్నింటికి మొండివాదనొకటి బాగా నేర్చుకున్నావు, ఆపకింటి శాంతని చూడవే. నీకంటె ఒక యేడాది చిన్నదేగా, అప్పుడే పండుల్లాంటి యిద్దరు పిల్లల్ని యెత్తుకుంది,

వీణ :- ఆ గొప్పపని చేసింది, అందుకే నలభైయేళ్ళ ముసలమ్మలా తయారైంది,

తల్లి :- వీణా నీతో వాదించడంచాలాకష్టం, నాకు లోపలచాలా పనుంది. తీరా వాళ్ళొచ్చాక నువ్విలా మొండికెత్తితే ఎలాగే. ఇంకోసారి నేనసలేమీ పట్టించుకోను, తండ్రీకూతురుకలిసి యేంచేసుకుంటారో చేసుకోండి. ఈసారికి నా పరువుదక్కించు అంతేచాలు,

వీణ :- పరువు దక్కించడానికేముందమ్మా ! మగపిల్లాడు కనబడితేచాలు వాణ్ణి అందల మెక్కిస్తున్నారు. డబ్బిచ్చి కాళ్ళు పట్టుకుంటున్నారు, అసలు మీ పెద్దవాళ్ళకి మానం అభిమానం ఉన్నట్టేలేదు. ఆడపిల్లకి మెళ్ళో తాళిపడితేచాలు, బాధ్యత తీరిందనుకుంటారు.

తల్లి :- మాకు మానాభిమానాలు లేకకాదే. మీకు పెళ్ళయ్యేదారిలేక, సాంప్రదాయ కుటుంబంలోపుట్టినవాడు, బాగా చదువుకున్నవాడు కట్నమిస్తేమాత్రం ఎక్కడ దొరుకుతాడే. అటువంటివాణ్ణి కాళ్ళుపట్టుకున్నా తప్పులేదు.

వీణ :- మీపెద్దవాళ్ళకి ఏదీ తప్పులేదు, ఎవరికాళ్ళు పట్టుకున్నా తప్పులేదు, డబ్బిచ్చి మరీ కాళ్ళుపట్టుకుంటారు, తలుచుకుంటే వళ్ళు మండుతుంది. మీపెద్దలు ముందు మారితేతప్ప ఈసమాజం మారదు.

తల్లి :- చాల్లేవే వుపన్యాసాలు నువ్వూను, ఏదైన జరిగేది మాట్లాడాలి, జరగనివిషయా అన్నీ ఎందుకు, ఇప్పుడింతకీ తెములుతావాలేదా ?

వీణ :- సరే యేంచేస్తాను. తప్పుతుందా ! కాస్త ఆ రత్తిచేత కాఫీ పంపించు.

తల్లి :- నేను కాస్త టిఫిన్లసంగతీ అదీ చూస్తాను. ఒసే రత్తి ! రత్తి ! అమ్మాయికి కాఫీపట్టుకొచ్చి యివ్వవే

(అంటూ లోపలికెళ్ళును)

వీణ-: అబ్బబ్బ ! ఇదెక్కడి కర్మరా నాయనా. ఈ పెళ్ళిచూపుల్ని తప్పించుకునే దారే కనబడ్డంలేదు.

(కుర్చీలోంచిలేచి అటు ఇటు తిరుగుతూ వుంటుంది.)

(రత్తి కాఫీకప్పుతో హడావిడిగా ప్రవేశం)

రత్తి :- అయ్యబాబోయ్ ! బాబోయ్ కొంప మునిగిపోయినాదండి, ఇదిగోనండికాఫీ ! తాగేయండి

వీణ :- ఏమైందే త్వరగా చెప్పవే ?

రత్తి :- అయ్యబాబోయ్ బాబోయ్ ఏమవుతాదండి, మరేమో అమ్మగోరు ఒకటే పాదిత్తున్నారండి. మీరు యెంటనే తెమిలిపోవాలండి.

వీణ :- (ఆ - ఆ - నవ్వు) ఓసినీ - ఇంతేనా.

రత్తి :- మీరు మరీనండి. ఒకటేనవ్వేత్తారు. నాకు ఒకటే సిగ్గేసేత్తాది, (సిగ్గు నటించవలెను.)

(లోపలినుంచి తల్లిపిలుపు)

తల్లి :- ఒసేరత్తి ! రత్తి ! అమ్మాయి తెమిలిందా ?

రత్తి :- అయ్యబాబోయ్ ! బాబోయ్ ! అదైంతసేపండి - సిటికెలో సేసేత్తాను.

వీణ :- (ఆ - ఆ - ఆ - ఆ - నవ్వు)

రత్తి :- ఏటండా నవ్వు నన్నే ముత్తాబుసెయ్యమన్నారేటి, నేనుసేత్తే ఎంటనే పెళ్లి అయిపోవలసిందే నండి.

వీణ :- నోరు మూసుకోవే ! పనికిరానికబుర్లు నువ్వూను.

రత్తి :- అయ్యబాబోయ్ ! బాబోయ్. నిజంసెప్పినా మీరు యేలాకోలమే అనుకుంటె యెట్టాగండీ ! పెళ్ళోళ్ళి ఈడే కూకోపెడతారుటండి. ఈగది ఊడ్చాలండి.

(చేతిలోకి బట్టతీసుకుని అన్ని దులపడం మొదలుపెట్టి - కూనిరాగం తీస్తూంటుంది.)

వీణ :- ఏం రత్తి ! అంత హుషారొచ్చిం దేమిటే.

రత్తి:- అయ్య బాబోయ్ ! బాబోయ్ నాకు రాకపోతే యింకేరి కొస్తాదండి. సిటికెలో తొమ్మిదై పోద్దండి ఆరు దిగిపోతారండి పైగా నేనేకదండి పెల్లి పెద్దని.

వీణ :- ఆ - ఆ - (నవ్వు.)

రత్తి :- పోదు రమ్మాయిగోరు. ఒక్కటే నవ్వేస్తున్నారు. అదిగోనండి మీకు పెళ్లికల ఎలా వచ్చేసిందోనండి.

వీణ :- ఆ ఆ (మళ్ళీ నవ్వు)

(ఇంతలో తల్లి లోపలనుంచి)

తల్లి : వీణా వీణా చీరా అది మార్చుకున్నావా ? లేదా ?

రత్తి : తేమిలిపోతున్నారండి సిటికెలో రెడీయైపోతారండి.

(వీణ వేపే తిరిగి)

అయి బాబోయ్ - బాబోయ్ అమ్మగారు తిడుతున్నారండి కాసేపుంటె నన్ను సావకొడతారుకూడానండి. తయారుకావాలండి.

(అంటూ ఆమెను లేవతీసి లోపలికి పంపును ఇంతలో పక్కింటి పుల్లమ్మ ప్రవేశం)

పుల్లమ్మ : పార్వతమ్మ తల్లీ ! పార్వతమ్మతల్లీ ! ఏం చేస్తున్నావమ్మా !

రత్తి : ఓ పక్కింటి పుల్లమ్మగారా ! ఏటి పొద్దుటే యేల తప్పకుండా బయలుదేరారు. అమ్మగారికి కాలీలేదండి. తమరు వచ్చినదారెంటే యెల్లొచ్చు.

పు : ఆ - ఆ నీ పొగరు మండిపోను నీ కోసం యెవరొచ్చేరే ?

రత్తి : నాకోసమని యేరన్నారండీ అమ్మగోరు పనిలోవున్నారు. ఈయేల సూడ్డాని కీల్లేదు అంతే.

పు :- ఆ - ఆ - ఎంత పొగరే నీకు, మధ్య నీ బోడి పెత్తనమేమిటే? పార్వతమ్మా! పార్వతమ్మా!

రత్తి :- ఈడలేరు, పిలిసినా పలుకరు,

పు :- ఒసే రత్తీ నీ కాస్త పుణ్యముంటుందే! కాస్త రెండుల్లిపాయలు తెచ్చిపెట్టవే.

రత్తి:- ఏటండీ, ఈడ కోడిగుడ్లు తేరగా పండుతాయనుకున్నారేటి.

పు :- ఆ - ఆ కోడిగుడ్లు ఎవరడిగేరే, నీకు కళ్ళు నెత్తిమీది కొచ్చాయే.

రత్తి:- అంతగట్టిగా అరుత్తారు దేనికి, తమలాటోరు వుల్లిపాయలు తినగాలేంది కోడి గుడ్లు తింటే తప్పేటి పైగా కోడిగుడ్లు శానా మంచివని మా మావ శప్పిండు.

పు :- నీ నోరు దేముడెత్తుగెళ్ళ, హద్దూ పద్దూ లేకుండా మాట్లాడుతున్నావేరత్తీ పార్వతమ్మరాని నీ పని చెబుతాను.

రత్తి:- ఏటండోయ్ పుల్లమ్మగోరు జాగ్రత్తగా సూసుకుని మాటాడండి, రత్తి, గిత్తీ అంటే నే నసల పడను. నాకు కోపం కూడాశానా జాత్తి, తెలిసిందా!

పు ! పడక ఏం చేస్తావేం, రత్తీ అనకపోతే మరేమనమన్నవే.

రత్తి : మా మావ సూడండి సక్కగా రత్తాలు అని ఎంత ముద్దుగా పిలుత్తాడని ఈ మాటలా రత్తీ అన్నారంటే ఏం సేత్తానో తెలుసా (అంటూ మీది మీది కెళ్ళును)

పు :- ఆ - ఆ - నీ కేమొచ్చిందే, నీ నోరు పడిపోను, నిన్ను దేముడెత్తుకెళ్ళా! నీతో మాట్లాడ్డమే తప్పే, ఓ పార్వతమ్మ తల్లీ, పార్వతమ్మ తల్లీ!

(తల్లి పార్వతమ్మ ప్రవేశం)

పార్వ: ఒసే రత్తీ! ఆవిడతో నీ కేం పనే, పెద్దా చిన్నాలేదు. ఒకటే వాగుడు ఏమిటి పిన్నిగారూ ప్రొద్దుటే యిలా వచ్చారు.

రత్తి : పుల్లమ్మగారు రాని పొద్దేటుంది కనకండి.

పు :- చూశావా - చూశావా పార్వతమ్మా! నువ్వుండగానె ఎలా అంటోందో.

పార్వ: ఆ దాంతో ఏమిటి పిన్నిగారూ-రత్తీ నువ్వు లోపలికెళ్ళు.

పు :- పనేం లేదమ్మా : ఏదో హడావిడిలో వున్నట్టున్నావు.

పార్వ:- హడావిడి కేముంది లెండి. అమ్మాయికీరోజు పెళ్ళివారొస్తున్నారు.

పు :- చాలా సంతోషమమ్మా! వారిది ఏవూరో, అబ్బాయి ఏం చేస్తున్నాడు.

పార్వ :- బొంబాయినుంచి వస్తున్నారు. పిల్లవాడు డాక్టరుట.

పు :- అలాగా అమ్మా! అయినా మీపిల్ల బుద్ధిమంతురాలే తల్లీ! అపక్కింటి పిల్లను చూశావా ? వచ్చీపోయే మొగాళ్ళలో ఒకటే పెక పెకలు పక పకలూనూ రామ, రామ! చూడలేకపోతున్నాననుకో.

పార్వ :- అలాగా పిన్నిగారూ! ఇరవైనాలుగు గంటలు యింట్లో పనులతోటి మునిగి పోయెనాకు అవన్నీ యెలా తెలుస్తాయండి. అయినా వాళ్ళ గొడవలు మన కెందుకులెండి.

పు :- అవును పార్వతమ్మా! బాగాచెప్పావు. ఏదో కళ్ళతో అవన్నీ చూడలేక అలా అన్నానమ్మా! అయినా అవేం ఫేషన్లే తల్లీ! వళ్ళంతా కనబడేటట్టు అబట్టలూ వాళ్ళూను. ఈకాలం పిల్లలు మరీబరి తెగించిపోయారనుకో. మీరలాగే వుండే వారామ్మా!

పార్వ :- ఏదోకాలం మారిపోయింది పిన్నిగారూ! ఏం చేస్తాం. ఈ రోజుల్లో యెవ రిష్టం వారిది.

పు :- నిజంమాటమ్మా! బాగాచెప్పావు. అయినా మనకెందుకులే అమ్మా! ఇంకా వంటకాలేదు. రెండుల్లిపాయలిలా పడేయమ్మా!

పార్వ :- రత్తీ! రత్తీ! నాలుగుల్లియలు పట్టుకొచ్చి పుల్లమ్మగారికియ్యి.

(లోపలినుంచి రత్తి)

రత్తి : అలాగేనండి.

పు :- ఆవుల్లిపాయలు అవి నాకెందుకమ్మా! ఏదో నాకొడుక్కిష్టమని. ఇదిగో పార్వ తమ్మా! అచేత్తో రెండు కరివేపాకు రెమ్మలుకూడా యిలా పడేయమ్మా!

పార్వ :- రత్తీ! వచ్చేటప్పుడు కరివేపాకు కూడా పట్టుకొచ్చి యివ్వవే!

రత్తి :- ఇవిగోనండి వుల్లిపాయలు. ఇదిగోనండి కరివేపాకు. అమ్మగోరు అసలేసెట్టంత అడ్డమైనవాళ్ళ కళ్ళుపడి మోడైపోయినాదండి. కూసంతకూడా లేదండి. ఇక

అడిగినోళ్ళందరికి పంచిపెట్టమోకండి.

సీత :- నువ్వూరుకోరత్తీ! నీక్కావలసింది అక్కరలేంది లేదు.

పుల్లమ్మ :- నే వెళ్ళొస్తానే అమ్మా!

పార్వ :- అలాగె వెళ్ళిరండి. నాకూ లోపల పనుంది,

(పార్వతమ్మ లోపలికెళ్ళును)

రత్తి :- పుల్లమ్మగారూ - తమరు దయసేయండి. మరిరాకండి. తేరగా దొరుకుతుందని రోజూ యిదేపని. తెల్లారితేభయం. రేపురాండి సెప్తాను.

పుల్లమ్మ :- నీపొగరు మండా - నీనోరు పడిపోను. నీకు నాఅవసరం రాకపోదే.

(అంటూ వెళ్ళిపోవును.)
(ఇంతలో వీణ ముస్తాబై ప్రవేశించును).

రత్తి :- అయ్యబాబోయ్ - బాబోయ్ - అమ్మాయిగోరండి మీరెంత బాగున్నారండి. అచ్చు సినీమాలో ఆణిశ్రీలాగున్నారండి. ఇలా ఈకుచ్చీమీద కూకోండి.

(కూర్చోపెట్టి మెటికలు విరిచి) అబ్బాయిగోరు యిప్పుడు మిమ్మల్ని చూశారంటేనండి ఆమాంతం ఎత్తుకుపోతారంటే నమ్మండి.

వీణ :- నోరు మూసుకోవే. వెధవకబుర్లు నువ్వూను.

(తెరలోపల ఒసేరత్తీ నువ్విలా లోపలికిరావే!)

రత్తి :- అయ్యబాబోయ్. బాబోయ్. ఎవరో వచ్చినట్టున్నారండి. నేసూత్తానండి,

(లోపలికి పరుగెత్తును).

వీణ :- అబ్బ బ్బ - ఇదెక్కడి పెళ్ళివారోకాని ముస్తాబు చేసుకోలేక విసుగేస్తోంది,

(అద్దం చేత్తో పట్టుకుని కూనిరాగాలుతీస్తూ తల అవి సర్దుకొంటు ఉంటుంది.
తిరిగి రత్తి ప్రవేశం).

రత్తి :- అమ్మాయిగోరు! అమ్మాయిగోరు! కొంప మునిగిపోయిందండి.

వీణ :- మళ్ళీ ఏమయిందే.

రత్తి :- ఏమవడం ఏటండీ. పెళ్ళోరు వొచ్చేసినారండి, అబ్బాయిగోరు; అల్లిమ్మ గోరు వచ్చేసినారండి.

వీణ :- కాస్త మెల్లిగాచెప్పవే.

రత్తి :- మరేమోనండీ ! అబ్బాయిగోరు బలేగా వున్నారండి, ఇంక తల్లిగారండీ ! ఆ - ఆ : ఆ - ఆ - (నవ్వు).

వీణ :- నీనవ్వు బంగారంగాను. ఆ వెకిలినవ్వేమిటే.

రత్తి : ఆ - ఆ - ఆ - (నవ్వు) ఆయమ్మగారండీ ! పేద్ద కొబ్బరికాయంత ముడండి, కుడిసేతికో ఆసీ - ఇంతెత్తు సెప్పులు కాగితంలాంటి సీర - ఆ - ఆ - ఆ - (నవ్వు) సినీమాలో సూరికాంతంలా గున్నారండి.

వీణ :- ఆ - ఆ - ఆ - (నవ్వు) నీవర్ణన బంగారంగాను యింక నోరుమూసుకోవే !

రత్తి :- ఆ - ఆ - ఆ - (నవ్వు) అదేం యేసమండి. పిచ్చేసమాని (మళ్ళీనవ్వు).

(తెరలో తల్లి) రత్తీ ! రత్తీ ! ఇలారావే.

రత్తి : అయ్యా బాబోయ్, బాబోయ్ అమ్మగారు పిలుత్తున్నారండి. (పరుగెత్తును)

వీణ :- (కూనిరాగం తీస్తూ పుస్తకం చదువుతూవుంటుంది).

(రత్తి పెద్దగా నవ్వుతూ మళ్ళీ ప్రవేశం).

రత్తి :- ఆ - ఆ - ఆ - ఆ - (నవ్వు)

వీణ :- మళ్ళీ ఏమయిందే.

రత్తి :- మరేమోనండి - మరేమోనండి (నవ్వు) పెళ్ళికొడుగ్గారి తల్లిగారండి మొహం కడుక్కుంటానని లేచారండి ముందుఎనక సూడకుండా ఎత్తుసెప్పు లేసుకుని యిస యిసానడుత్తూ మన బాతురూంకాడ ధాం అని జారిపడ్డారండి. (నవ్వు) ఆయిడ సోకుసీరకాత్తా పాడయిపోయినాదండి.

(ఆ - ఆ - ఆ - నవ్వు)

వీణ:- కాస్త మెల్లిగా చెప్పవే, వాళ్ళకి వినబడితే బాగుండదు.

రత్తి:- అప్పుడే అత్తగారంటే అంత అభిమాన మొచ్చేసినాదేటండీ.

వీణ:- నోరు ముయ్యవే - వెధవ కబుర్లు నువ్వూను.

రత్తి :- అయ్యబాబోయ్ ! బాబోయ్ అది కాదండీ. పోనీకందా అని నేను లేవతీత్తామని యెడితే నామీద యిరుసుకుపడ్డారండి. (ఆ - ఆ - నవ్వు)

వీణ :- ఆ - ఆ - ఆ (నవ్వు).

రత్తి :- మీ అమ్మగోరు ఆమధ్దైనసీర యిదవమంటేనండి తెగతిట్టి నాన్ సెన్స్ గీన్ సెన్స్ అని ఒద్దంటూనే మన పట్టుసీర కట్టేసుకున్నారండి. (ఆ - ఆనవ్వు)

వీణ :- ఇదెక్కడి గోలే - ఆ - ఆ - ఆ (నవ్వు)

రత్తి :- అసలుసంగతి మరిసేపోయినానండి. ఆపెల్లి కొడుగ్గారండీ - మీకోసం అటు ఇటు గుడ్లుతెగ తిప్పేత్తున్నారండి. నన్నుపిలిచి మీ అమ్మాయిగోరు ఎక్కడున్నారని అడిగినారండి.

వీణ :- నోరు మూసుకోవే ఇంక.

రత్తి :- ఒట్టండి, అబద్దమంటేనె నాకిట్టదండి.

(తల్లి ప్రవేశం)

తల్లి :- వీణా ! నువ్వు లోపలకివెళ్ళవే. రత్తీ అకుర్చీలు ఇటుపక్క పెట్టవే.

(వీణ ఒకపక్కనుంచి లోపలికెళ్ళాలి. తల్లి మరోపక్కనుంచివెళ్ళి పెళ్ళివారిని వెంట తీసుకొని వచ్చును.)

తల్లి :- బాబూ ! ఇలావచ్చి కూర్చో నాయనా ! ఒదినగారూ మీరిలారండి, ఒసేరత్తీ అలా చూస్తావేమే కాస్త చెయ్యిపట్టుకోవే.

కాంతం :- అబ్బే అక్కరలేదండీ. నే నడవగలను.

తల్లి :- దెబ్బ బాగానే తగిలినట్టుంది.

కాం :- అబ్బే అట్టే తగలలేదండి. అయినా మీ బాతురూం అంత దర్టీగా ఉందేమిటండి. మాబాతురూం అద్దంలా వుంటుందంటే నమ్మండి.

రత్తి :- (మెల్లిగా) కొత్తగా యెత్తుసెప్పు లేసుకుని వుంటారండి, కూసంత జాగ్రత్తగా నడవ వలసిందండి. కాలు జారేదికాదు. (ఇ - ఇ - ఇ - నవ్వు)

కాం :- ఏంపని పిల్లా ! మేనర్సులేకుండా యేమిటానవ్వు.

తల్లి :- ఒసేరత్తీ ఏమిటానవ్వు.

పెం.కొ :- పోనీయమ్మా! ఆమెతో నీకేంపని.

కాం :- అసలిలాటి చిన్న చిన్న సిటీలంటేనే నాకిష్టముండదు. బొంబాయిలో ఎంత బాగుంటుందనుకున్నారు.

రత్తి :- ఇ - ఇ - ఇ - (నవ్వు)

కాం :- ఏం పనిపిల్లా! ఎందుకలా పళ్ళికిలిస్తున్నావు. నేనెవర్నో తెలుసా జడ్జీగారి మనవరాల్ని. కలక్టరుగారి కోడల్ని. ఏమనుకుంటున్నావో.

రత్తి :- నేనేమనుకోడం యేటండీ. మా అమ్మగారెవరో మీకు తెలుసాండీ. ఏకంగా మినిష్టరిగారి కూతురండి ఏటనుకున్నారో - పైగా ఈరొక్కరే సంతానమండీ.

అందరు :- (ఆ - ఆ - ఆ - నవ్వుదురు)

తల్లి :- ఒసేరత్తీ! ఆగొడవలన్నీ నీకెందుకే.

రత్తి :- అయినా నాకెందుకులేండి. నోరు మూసుకుంటానండి.

తల్లి :- దానికలా వాగటం అలవాటు, దానిమాట లెక్కచేయకండి.

కాం :- ఈరోజుల్లో పనిమనుషులందరూ యింతేనండి. మాటనకుండానె మీద పడిపోతారు. అయినా మీరలా నెత్తికెక్కించుకోడం బాగుండలేదు.

తల్లి :- ఏదో చిన్నతనంనుంచి యిక్కడ పెరిగిందండి. అందుకని కాస్తచనువు. మనిషి చాలామంచిది. ఒసేరత్తీ లోపలికెళ్ళి ఆ ఫలహారాలు అవి పట్టుకురా - (రత్తి లోపలికెళ్ళి ప్లేటులు పట్టుకొచ్చును). తీసుకోండి ఒదినగారు - తీసుకోండి. తీసుకోబాబు తీసుకో.

కాం :- ఇప్పుడే హోటల్లో అన్నీ తినొచ్చామండీ.

తల్లి :- అలా అంటే ఎలా ఒదినగారూ! అసలే నీరసంగా కనపడుతున్నారు. కొంచెం తీసుకోండి, అబ్బాయినికూడా తీసుకోమనండి.

కాం :- వాడికసలు ఇలాటి వంటేనే పడవండి. ఇక నాకంటారా! ఒక్కటే నీరసం. ఏం జబ్బోకానీండి. అన్నంమానేసి ఆరునెల లయిందంటే నమ్మండి. మూడుసార్లు పాలు నాలుగుసార్లు బత్తాయిరసం. ప్రొద్దుటపూట అరడజను ఇడ్లీలుతిని, రాత్రి

ఏదో లైటుగా నాలుగు చపాతీలు రెండు యాపిల్సుతిని వుంటాననుకోండి.

తల్లి :- అయ్యో ! అలాగండి పాపం. మరి డాక్టరుగారికి చూపించుకోలేదాండీ.

కాం :- చూపించుకో వోవడం యేమిటండీ అసలు డాక్టరుదగ్గరకెళ్ళందే ఒక్కరోజు గడవదంటే నమ్మండి. మునపటిలో యిప్పుడు సగంకూడా లేవనుకోండి. అందుకే మావారు ఒసేకాంతం రోజు రోజుకి అలా చిక్కిపోతున్నావేమిటే. నిన్నుచూడలేక విలవిల్లాడి పోతున్నానంటారు.

పెం.కొ :- ఇంక వూరుకోమ్మా. ఆగొడవలన్నీ యెందుకు.

రత్తి :- ఇ - ఇ - ఇ - (నవ్వు. మెల్లిగా) అందుకే గుమ్మంపట్టనట్టుంది. ఇ - - ఇ - (నవ్వు).

తల్లి -(మెల్లగా) రత్తీ ! నోరు మూసుకోవే !

కాం :- ఏంపనిపిల్లా ! మానర్సులేకుండా యేమిటానవ్వు. ఇదే మా పనిమనిషైతేనా వెంటనే డిసీమిస్ చేసి కొత్తమనిషిని తెచ్చుకొనేదాన్ని. తెలిసిందా !

రత్తి :- అసలు నేనైతేనాండి ఒక్కపూటకూడా మీకాడ పనిచేసేదాన్ని కాదు. ఎంటనే పారిపోయేదాన్ని తెలిసిందా !

పెం.కొ :- అమ్మా ! ఆమెతో నీకెందుకమ్మా వాదన.

తల్లి :- దాంతో ఏమిటండి, అదోవెర్రిది. కాఫీలు తీసుకోండి. (కాఫీప్లేట్లు పక్కన పెట్టి కాఫీకప్పులు అందుకొందురు.)

కాం :- (కాఫీ తాగుతూ) మేమొచ్చి చాలాసేపయింది. మేము మళ్ళీ వెళ్ళిపోవాలి. అమ్మాయిని చూపిస్తారా !

తల్లి :- అయ్యో అలాగే చూపిస్తామండి.

(లోపలికివెళ్ళి వీణను వెంటపెట్టుకొని వచ్చును).

వీణా యిలా కూర్చోమ్మా !

కాం :- నీ పేరేమిటమ్మా ? ఎంతవరకు చదువుకున్నావు.

వీణ :- వీణండి. బి. ఎ పాసయ్యాను.

కాం :- మీలాగె మీపేర్లుకూడా చాదస్తంగా వుంటాయనుకున్నాను. మోడరన్‌గా బాగానేవుందే, అదిసరే సినీసాంగ్సు పాడుతావా ?

వీణ :- అంతగా రావండి.

కాం :- నాన్ సెన్స్ ఈరోజుల్లో సినీసాంగ్సు రానివారెవరు.

రత్తి :- నాకుబాగా వచ్చండి. నేను పాడేస్తానండి,

పెం.కొ :- అయితే ఇంకేం ? పాడు ! పాడు.

రత్తి :- "సూడు సిన్నమ్మా - పాడు బుల్లోడు - పైన పైన పడుతు వుంటాడు."

(అందరూ నవ్వుదురు - రత్తి పాట ఆపును).

పెం.కొ :- ఆపేశావేం, పూర్తిగా పాడేసెయ్యి.

రత్తి :- అయ్య బాబోయ్, అమ్మాయిగోరు గుడ్లురిమి సూత్తున్నారండి. ఇంక పాడనండి. బాబోయ్.

(మెల్లిగా వీణచెవిలో) అబ్బాయిగోరు మీదిక్కే సూత్తున్నారండి.

వీణ :- (మెల్లిగా) నోరుమూసుకోవే ?

రత్తి :- (మూతి విరుచును.)

కాం :- వీణా ! నీకు ఇంగ్లీషు పిక్చర్సంటే యిష్టమా ? హిందీ పిక్చర్సంటే యిష్టమా ?

వీణ :- నాకెక్కువ పిక్చర్సుచూడ్డం అలవాటులేదండి.

కాం :- నాకసలు తెలుగు పిక్చర్సంటేనే బోరనుకోండి, సాయంకాలం అలా క్లబ్బుల్లో తిరగందే తోచనే తోచదనుకోండి.

తల్లి :- క్లబ్బులంటే మాకేం తెలుస్తాయండి. ఇంటిపనేతీరక పిల్లల్ని సరిగా చూసుకోలేక పోతున్నామని బాధ పడుతున్నాం.

కాం :- ఆ : అవునవును. జానెడు బెత్తెడు సిటీలోవున్న మీకేంతెలుస్తాయండి ఆపేషన్ల సంగతి. ఓరే మోహన్ ! నీవేమైనా అడుగుతావా అమ్మాయిని.

పెం.కొ :- అన్నీనువ్వే అడుగుతున్నావు కదమ్మా ! ఇంక నేనేమడుగుతాను. అంతా నీయిష్టమే.

రత్తి :- (మెల్లిగా) ఆ - ఆ - అందుకే యిన్ని యెత్రియేసాలు యేస్తోంది, ఇ - ఇ - ఇ - (నవ్వు).

కాం :- ఏంపని పిల్లా పళ్ళికిలించడంతప్ప నీకేం పనిలేదనుకుంటాను.

రత్తి :- అయ్యబాబోయ్ ! బాబోయ్, నేనేం పళ్లికిలిస్తున్నానండి, అయినా మద్దె. నాకెందుకులెండి,

కాం :- ఒరే మోహన్, నువ్వింక కాస్త అలావెళ్ళి కూర్చోరా ! మేం కట్నాలవిషయాలు మాట్లాడుకోవాలి. ఇక అమ్మాయినికూడా లోపలికి పంపించండి.

తల్లి :- వీణా లోపలికెళ్ళమ్మా !

(పెం.కా ఒక వైపునుంచి వీణ మరోవైపునుంచి లోపలి కెళ్ళుతారు)

కాం :- పార్వతమ్మగారు ఇక కట్నాలసంగతి తేల్చండి.

తల్లి :- అబ్బాయికి పిల్ల అంగీకారమేనంటారా ! ఒకసారి అబ్బాయినికూడా అడిగి చూడకపోయారా !

కాం :- అబ్బాయికేం తెలుసండి. మాకునచ్చితే వాడికి నచ్చినట్లే పెళ్ళిళ్ళ విషయంలో వాడికేం అనుభవముందండి. కుర్ర కుంక, పిల్ల బాగుంటుందని యిక్కడకు తీసుకొచ్చాడు.

తల్లి :- కట్నానికేముందండి, మీకెలా కావాలంటె అలాగే చేస్తాం.

కాం :- అలా చేస్తామంటె ఎలాగండి. మాకసలు పెద్దకట్నాలు అక్కరలేదు. అత్తగారి లాంఛనాలు ఐదువేలు తప్పవనుకోండి. ఇంకనాకు ఒకర్తేకూతురు, దానికికూడా అయిదువేలు ఇవ్వవలసిందే.

తల్లి :- దానికేం లెండి.

కాం :- అప్పగింతల బట్టలూ, అలక చీరెలూ అన్నీ ఫారిన్‌వే వుండాలి. ఇక పానకం బిందెలుఅవి స్టీలువేవుండాలి. పైగా అబ్బాయి బట్టలకు పదివేలు అలక పాన్పుమీద స్కూటరు, వుండాలి సుమండి.

తల్లి :- దానికేం కొనేవుంచాములెండి.

కాం :- అమ్మాయి సారె సామానుతోపాటు ఫ్రిజ్, కుక్కర్, టి. వి పెట్టి వుండాలి సుమండి.

తల్లి :- మావారు వూళ్ళోలేరు వారొచ్చాక అన్నీ మాట్లాడి నిశ్చయించుకుందాం.

కాం :- అప్పే అలా అంటే కాదండి, యివన్నీ మాట్లాడుకోడానికి మగవాళ్ళెందుకండి, ఇవన్నీ ఆడవాళ్ళ సంగతులండీ.

తల్లి :-ఆడవాళ్ళ విషయాలే అనుకోండి, అయినా కొని యివ్వవలసింది మగవారేగా.

కాం :- అయినా మనం ఒప్పుకుంటే వాళ్ళతో ఏముంది, ఎంతలేదన్నా అమ్మాయి వొంటిమీద పాతిక తులాల బంగారం వుండి తీరవలసిందే.

తల్లి :- అలాగాండి.

కాం :- ఇక అబ్బాయి ఫారిన్ వెళ్ళబోతున్నాడు. వాడితో పిల్లను పంపటానికి మీరే పెట్టుకోవాలి. ఇంక యింతకంటె యెక్కువయేమీ అడగ దలుచుకోలేదండి.

రతి :- చాల్లేవమ్మా ! ఇంకేటి మిగిలినాయి అడగటానికి.

కాం :- పానకంలో పుడకలా మధ్య నువ్వేమిటి ?

తల్లి :- రత్తీ నువ్వూరుకో, ఒదినగారూ ! దాంతో యేమిటిలెండి, మీరుకాస్త నిధానంగా ఆలోచించండి, ఇన్నిచ్చుకోలవాలంటె సామాన్యమైన విషయంకాదు. అయినా మా వారొచ్చాక అన్నీ మాట్లాడుకుందాం.

కాం :- నాన్ సెన్స్, అలా అంటేకాదు, వెంటనే తేల్చి చెప్పవలసిందే, మీపిల్లే మాకు గతనుకుంటున్నారా ! కో అంటే కోటి సంబంధాలు, తెలిసిందాండి.

తల్లి :. అలా అంటెకాదు వదినగారు. మావా రొచ్చేవరకు ఆగండి.

కాం :- మాయింట్లో అన్నీ ఆడవాళ్ళే చూసుకుంటాము, దీనికి మగవాళ్ళెందుకని, మీ రిచ్చుకోలేమంటే ఇప్పుడే వెళ్ళిపోతాం.

రత్తి :- ఆ వెడితే వెళ్ళనీయమ్మ ఈరుతప్ప మనకు గతేలేరండి, ఊరికే బతిమాలకండి.

కాం :- ఆ - ఆ - ఎంతలేసి మాటలంటున్నావే. మాది గతిలేని సంబంధంటే, ఇంత అవమానం జరిగాక మేమిక్కడ ఒక్క క్షణం వుండం వెంటనే వెళ్ళి పోవలసిందే.

తల్లి :- అలాఅంటే కాదండి వొదినగారూ !

కాం :- నాన్‌సెన్సు ! ఇలాటి నాసుపు మనుష్యులతో మాక్కుదరదు. పిల్లకాస్త బాగుం దంటె యింతదూరం వచ్చాంకాని లక్ష లక్షల కట్నమిస్తామంటున్నారు. ఇంక ఒక్కక్షణం ఇక్కడుండం.

రత్తి :- వెడితే వెళ్ళారు కానీండి. మాచీర మాకిచ్చి మరీవెళ్ళండి.

కాం :- ఇందాకటినుంచి చూస్తున్నానీవరస. నే నెవరనుకుంటున్నావు. జడ్జీగారి మనవ రాల్ని - కలక్టరుగారి కోడల్ని తెలిసిందా ?

రత్తి :- అబ్బో బాగా తెలుసు, మా అమ్మగారెవరో తెలిసిందాండి, మినిష్టరుగారి కూతురండి.

తల్లి :- ఒసేరత్తీ, నీకెందుకే ఆ గొడవలన్నీను. నోరు మూసుకుని లోపలికెళ్ళవే.

రత్తి :- అలాగె యెదతాలెండి, అయినా నాకెందుకులెండి.

(రత్తి - లోపలికెళ్ళును)

కాం :- ఎంత పొగరేనీకు, ఎంతపొగరే, ఇంకిక్కడ ఒక్కక్షణం వుండను, ఒరే మోహన్ - కృష్ణమోహన్. రా ! రా ! వెళ్ళిపోదాం.

తల్లి :- అయ్యో వదినగారూ అలా అంటేకాదు, ఇప్పుడు మీకు రైలుకూడా లేదు. ప్రయాణానికి యిబ్బంది పడతారు.

కాం :- రైల్లో కాకపోతే ప్లేన్‌లో వెడతాం. మీ కెందుకొచ్చినగొడవ, ఒరే కృష్ణ మోహన్, కృష్ణమోహన్. ఎక్కడున్నావురా !

(రత్తి హడావిడిగా పరుగెత్తుకొచ్చును)

రత్తి :- అయ్య బాబోయ్ ! బాబోయ్ కొంప మునిగిపోయినాదండి. కొంప మునిగి పోయినాదండి.

తల్లి :- కొంప మునగడమేమిటే ! త్వరగా చెప్పి యేడవ్వే.

రత్తి :- అదికాదండమ్మగోరు.

తల్లి :- అలా నానుస్తావేమిటే - త్వరగా చెప్పవే -

రత్తి :- అయ్య బాబోయ్ - బాబోయ్ ఎలా సెప్పాలండి. సెప్పటానికి నోరు రాటం లేదంటే నమ్మండి.

తల్లి :- అదేమిటో చెప్పి మరీ ఏడవ్వే.

రత్తి :- ఎలా సెప్పనండి. అబ్బాయిగోరు మన వీనమ్మగోరు కనబడ్డంలేదండీ.

తల్లి :- అదేమిటే నీకెవరుచెప్పారే.

రత్తి :- అయ్య బాబోయ్ ! బాబోయ్ ఏరు సెప్పడ మేమిటండీ ఇంట్లో ఎక్కడా కనబడ్డంలేదండి ఆరు.

తల్లి :- అయ్యో ! అయ్యో ! ఎంతపని జరిగిపోయిందే, ఇప్పుడేం చెయ్యాలే !

రత్తి :- అంకేం చెస్తారండి. ఇద్దరికి పెండ్లి సేసెయ్యాలండి, అంతే.

కాం :- (గుండెలు బాదుకుంటూ) మోహన్ - మోహన్ ఎంతపని చేశావురా ! నాకొంప ముంచావుకదరా ! ఇంకనేనెలా తలెత్తుకు తిరగాలిరా !

రత్తి :- ఇంకెందుకండి గుండెలు బాదుకుంటారు, తల దించుకునే తిరగాలండీ.

కాం :- (ఏడుపు గొంతుకతో) మధ్యలో నీగొడవేమిటే, ఒరే మోహన్ కృష్ణ మోహన్, మూర్ఛపోవును.)

తల్లి :- ఒసేరత్తీ ! అలా చూస్తావేమిటే. కాసిన్ని నీళ్ళుపట్టుకొచ్చి మొహంమీద చల్లవే.

రత్తి :- ఆరేలేచి కూకుంటారండి, ఊరికే కంగారుపడబోకండి. (అంటూ నీళ్ళుతెచ్చి చల్లును. కాస్త తేరుకుంటుంది.)

తల్లి :- ఒదినగారూ ! కాసిన్ని నీళ్ళుతాగండి.

కాం :- (ఏడుస్తూ - ముక్కు చీదుకుంటూ) ఇంత అవమానం జరిగాక యింకా మంచి నీళ్ళెందుకులెండి. చూశారా ఎంతపనిచేశారో, నాకొంప ముంచాడుకదండీ.

తల్లి :- అలా అనకండి ఒదినగారూ ! ఒకగ్లాసుడు పాలుతాగండి. మీకసలే నీరసం. రత్తీ పాలగ్లాసిలాతేవే.

రత్తి :- అంతా దొంగనీరసం, కాసేపుంటే అదేపోద్ది.

కాం :- (పాలు తాగుతూ) ఏదోనమ్మా. నువ్వొకినక నన్ను అర్థం చేసుకున్నావు. వేరే వాళ్ళయితేనా !

తల్లి :- దానికేంలెండి వదినగారూ ! ఒసేరత్తీ ! ఇంకా అలా నుంచుంటావేమిటే ! వాళ్ళెక్కడికెళ్ళారో చూసిరావే !

(రత్తి పరుగెత్తుకెళ్ళును).

కాం :- వాడిలా చేస్తాడనుకోలేదు !నన్నిలా అవమానపరుస్తా డనుకోలేదు.

(రత్తి పరుగెత్తుకువచ్చును.)

కాం :- అయ్యబాబోయ్ ! బాబోయ్. వీణమ్మగోరు, అబ్బాయిగోరు యీధిసివర గుడికాడ నుంచి వచ్చేత్తున్నారండి. మెల్లో దండలేసుకుని చేతులుపట్టుకు మరీ వత్తున్నా రండీ. ఆరమ్మ సిలకా గోరంకల్లా వున్నా రంటె నమ్మండి.

తల్లి :- ఆ - ఆ - ఎంతపని చేశారే ! ఒసేరత్తీ యిదెక్కడి గొడవే ?

(కంగారుగా అటు యిటు తిరుగును)

కాం :- రానీ ! రానీ ! వాడంతు తేలుస్తాను.

(ఇద్దరూ ప్రవేశం)

వీణ : వెం.కొ :- అమ్మా ! నమస్కారం. అత్తగారూ ! నమస్కారం.

కాం :- ఎంతపని చేశావురా ! నన్నిక్కడికి తీసుకొచ్చి యిలా అవమానం చేస్తావనుకో లేదురా ! (గుండెలు బాదుకుంటు).

తల్లి :- ఏమిటే ఇదంత. అలా చేశావేమిటే !

వీణ :- నాకేం తెలీదమ్మా ! మోహనే చేశాడమ్మా !

కాం :- నంగనాచిలాగ యింకా నీతులు మాట్లాడుతోంది. ఇదంతా దీనిమూలంగానే జరిగింది. నాకొడుకెంత మంచివాడో. దీనివలలోపడే పాడైపోయాడు.

వెం.కొ :- వీణేమీ చెయ్యలేదమ్మా !

కాం :- మరెవ్వరు చేశార్రా. కనిపెంచి నీకోసం యింత కష్టపడ్డమమ్మల్ని ఒక్క

క్షణంలో ఎలా మర్చిపోయావురా। దాన్ని చూడగానే దాని వెంబడెలా పోయావురా।

పెం.కొ :- అమ్మా। ఎందుకంత బాధపడతావు. వీణనాకు అన్నివిధాలా నచ్చింది. కట్నం పేరుతో ఎంతోమందిని బాధపెట్టావు, ఎన్నో సంబంధాలు కాదని వచ్చే సాము. అందుకే యిలా చెయ్యవలసివచ్చింది.

కాం :- ఈకట్నాలు కానుకలు నాకోసంట్రా, అన్నీ నీకోసమే. ఏదోగొప్ప సంబంధం చేసుకుంటావని, ఎంతో వైభవంగా పెళ్ళవుతుందని చూడాలనుకున్నాను. చివరకు యిలా అవుతుందనుకోలేదురా।

పెం కొ :- వైభవానికేముందమ్మా। అవన్నీ నాకిష్టంలేదు. అయినా నాయిష్టా యిష్టాలను మీరెప్పుడు అడిగారని. ఆలోచించారని అందుకే యిలా చేశానమ్మా। క్షమించు.

కాం :- అంతా జరిగిపోయాక ఇంకేం క్షమించడంరా। ఇంక నేనొక్క క్షణం ఉండను. వెంటనే వెళ్ళిపోతారా।

రత్తి :- అబ్బాయిగా రిక్కడే ఉంటారండి. ఇక మీరెళ్ళిరండి.

కాం :- ఇదిగో అసలు దీనిమూలానె యింతపని జరిగింది.

పెం.కొ :- ఎందుకమ్మా అంతకోపం. నీకోడలు చాలా మంచిది. నిన్ను కూర్చోబెట్టి అన్నిపనులు చేసిపెడుతుంది. నిన్ను ఎంతోబాగా చూసుకుంటుంది. నీ కింత కంటె యేంకావాలమ్మా।

వీణ :- నమస్కారమండి అత్తగారూ।

రత్తి :- ఇంకెందుకండీ కోపం. ఒప్పేసుకోండి.

కాం :- ఒప్పుకోడాని కేముందిరా। నేనప్పుడే అనుకున్నారా : అమ్మాయినైస్ గరల్ అని అయినా నీ సెలక్షనెప్పుడూ వెరీగుడ్డేరా।

తల్లి :- అన్నీ బాగున్నాయికాని వీణా ఒక్కమాట చెప్పుంటే బాగుండేది.

పెం.కొ :- ముందుచెబితే మీరు వప్పుకునేవారా అత్తగారు. మీపెద్దల్ని ఒప్పించాలంటే కాస్త యిలాటిపనులు చెయ్యక తప్పదండి. మీమనస్సు నొప్పిస్తే క్షమించండి.

(పుల్లమ్మ ప్రవేశం)

పుల్లి :- ఏమిటే పార్వతమ్మా. నీకూతురు ఎవర్నో పెళ్ళిచేసుకుందిటగా.

రత్తి : మీవరకు ఒచ్చినాది యిసయం ! ఇంక దీయించడాని కొచ్చినారేటండి.

పుల్లి :- దీనికూ్కడా నీయిష్టమేనేమిటే ? వీణా ఎక్కడున్నావే అమ్మా ! (వాళ్ళని పరకాయించిచూసి) ఎంత బాగున్నారే అమ్మా ! చిలకా గోరింకల్లా వున్నారు. అంతా మీ అదృష్టం పార్వతమ్మా ! ఇలా పెళ్ళిళ్ళు జరిగిపోతుంటే యింకేం కావాలే అమ్మా ?

రత్తి :- అంతేనండి పుల్లమ్మగోరు. బాగా సెప్పారండి, అమ్మాయిగోరు ! అబ్బాయి గోరూ మీరిప్పుడచ్చు సినీమాలో జంటలాగున్నారండి. నేనప్పుడే కనిపెట్టాశానండి అబ్బాయిగోరి తంతంతా. అయినా నాకెందుకులెండి, మీరు మీరు ఒక్కటేగా !

# తరం మారింది

## (ఏకాంకిక)

పెద్దలు తమ తరం మారిందని సరిపెట్టుకోలేరు. పిల్లలమీద తమ పెద్దరికం నిలబెట్టుకోవాలని తాపత్రయపడతారు. తాము ఆచరించేదానిని ఆదర్శంగా పెట్టుకుని పిన్నలు అలాగే నడవాలని ప్రయత్నంచేస్తారు. కాని తరం మారినప్పుడు సాంఘికాచారాలు కొన్ని మారక ఆగవు. యువతరం ముందంజవేస్తూనే వుంటుంది.

గంగమ్మ కొడుకు రాజు ఒకరోజు చాలా సేపటినుంచి బస్సుస్టాపులో నిలబడ్డ రాధను తన స్కూటరుమీద ఆఫీసుదగ్గర దిగబెడతాడు. అదిచూసిన గంగమ్మ డా॥ సరోజ హాస్పటలుకు రాధ వస్తుందనితెలుసుకొని అక్కడ కెడుతుంది. అక్కడ డా॥ సరోజ, రాణి మాత్రమే వుంటారు. రాధనుగుర్తుపట్టలేని ఆవిడ వాళ్ళను నానామాట్లు మాట్లాడుతుంది. ఆవిడకు పక్కింటి సుబ్బాయమ్మ తాళం పలుకుతుంది. అంతలో రాధవస్తుంది. అందరిలో అల్లరి పిల్లయైన రాధ ఆవిడను ఏడిపించాలని రాజును పెళ్ళి చేసుకున్నానని చెబుతుంది. ఆవిడ యింటికి పరుగెత్తికెళ్ళి కొడుకును నానా చివాట్లు పెడుతుంది. సరోజ రాధను కోపంచేస్తుంది.

పెళ్ళి చేసుకోకుండానె తల్లిచేత అనవసరంగా చివాట్లుతిన్న రాజు నిజంగానె రాధను పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు. దారిలోకనపడ్డ ఆమెను అడుగుతాడు ఆమె తిరస్కరిస్తుంది. తల్లిని, రాధను భయపెట్టాలని విషం మింగానంటాడు. తల్లి కంగారుపడి సరోజ హాస్పటల్‌కి తీసుకొస్తుంది. నిజంగా విషంమింగలేదని తెలుసుకున్న సరోజ రాధను పెళ్ళికి అంగీకరింపచేస్తుంది. అంత జరిగాక గంగమ్మ తనతప్పు గ్రహించుకుని మారిన తరంలో తాము మారాలని అంగీకరిస్తుంది. అందరు వారి వివాహానికి సంతోషిస్తారు.

ఇదే తరం మారింది హాస్య ఏకాంకిక.

# పాత్రలు

| | | |
|---|---|---|
| రాధ | : | ఉద్యోగస్తురాలు |
| రాణీ | : | రాధ స్నేహితురాలు |
| డా॥ సరోజ | : | రాధ, రాణీలకు ఆత్మీయురాలు |
| రాజు | : | రాధ క్లాసుమేటు |
| గంగమ్మ | : | రాజుతల్లి |
| సుబ్బాయమ్మ | : | రాధా, రాణి, సరోజలకు పక్కింటావిడ |

# తరం మారింది

రచన : డా॥ వాసా ప్రభావతి

(ఏకాంకిక)

డాక్టర్ సరోజా, రాణీ హాస్పటల్‌గదిలో కుర్చీలో కూర్చుని ఉంటారు. ఎదురుగా టేబుల్‌మీద స్టెతస్కోపు కాగితాలు ఉంటాయి.

గదిలో ఒకబల్లపై మందుల సీసాలుంటాయి. ఒకబెడ్‌పరచి ఉంటుంది. ఇంతలో ఒక స్త్రీ ప్రవేశిస్తుంది.

స్త్రీ :- (సరోజకేసి చెయ్యిపెట్టి చూపిస్తూ) ఇదుగో నీకసలు బుద్ధుందాంట !

రాణి :-ఎవరునువ్వు-నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నావు. మాటలుకాస్త జాగ్రత్తగారానీ.

సరోజ :- ఈవిడెవరే (నెమ్మదిగా)

రాణి :- ఏమో నేను చూడలేదెప్పుడు.

స్త్రీ :- ఇదిగో ! నీఆటలు నాదగ్గరకాదు. తెలీనట్టు నటించకు ఇక్కడుండేది నువ్వేగా నాకు బాగా తెలుసు.

సరోజ :- ఇదిగో మీరెవర్ని చూసి ఎవరనుకుంటున్నారో, మిమ్మల్నెప్పుడూ నేచూడలేదు.

స్త్రీ :- ఎవర్నిచూసి ఎవరనుకోడం ఏమిటి ? నువ్వునాకు బాగా తెలుసు.

సరోజ :- రాణీ ! ఇదెక్కడి గొడవే.

స్త్రీ :- ఆ - ఆ - ఆ - (నవ్వు) ఏం తెలీనట్టు మాట్లాడకు. నాకంటపడి తప్పించుకోలేవు తెలిసిందా ?

రాధ :- బహుశా పిచ్చిదేమోనే, వాలకం ఆలాగేఉంది.

సరోజ :- నాకూ ఆలాగే అనిపిస్తోంది. బహుశా పిచ్చాసుపత్రినుంచి తప్పించుకొచ్చుంటుంది -

రాణి :- ఇదిగో - ఈమెపేరు సరోజ. నువ్వెవర్ని చూసి ఎవరనుకుంటున్నావో ?

స్త్రీ :- సరోజా, గిరిజో నాకనవసరం. ఈమెనాకు బాగాతెలుసు.

రాణి :- ఆమె డాక్టరు, చెబుతూంటె నీకాఁదు· బహుశా నువ్వెప్పుడో రోగమొచ్చి నప్పుడు మందు కొచ్చుంటావు ?

స్త్రీ :- డాక్టరో ! డేక్టరో నాకుతెలీదు. అయినా నాకు రోగం రావడంఏమిటి ? ఛీ ! ఛీ ! దీనిదగ్గరకు మందుకు రావడంఏమిటి ? ఆ - అయితే నువ్వేఅయి ఉంటావు ?

రాణి :- అయి ఉండడమేమిటి నీమొహం.

సరోజ :- (నెమ్మదిగా) రాణీ - ఇక సందేహంలేదు. ఈమె పిచ్చిదేనే ?

స్త్రీ :- ఇదిగో పిచ్చి గిచ్చి అంటే ఊరుకోను తెలిసిందా ?

రాణి :- ఊరుకోక ఏంచేస్తావే.

స్త్రీ :- పీక నొక్కేస్తాను జాగ్రత్త ?

రాణి :- (కోపంగాలేచి) ఇదిగో పీకి నొక్కితే. నీకు ఉరేయించేస్తాను జాగ్రత్త.

సరోజ :- రాణి - ఊరుకోవే ఈ పిచ్చిదాంతో నీకెందుకే.

రాణి :- ఎందు కురుకోవాలే ముక్కు మొహం తెలీకుండా మాట్లాడుతోంది. దీనిపిచ్చి తేలవలసిందే.

స్త్రీ :- ఇదిగో నాపిచ్చి నువ్వేంతేలుస్తావు ? నీపిచ్చి కుదర్చకపోతే నాపేరు గంగమ్మ కాదు.

సరోజ;- ఇదిగో గంగమ్మగారూ మీరెవరో మాకుతెలీదు. ఎందుకొచ్చారో మా కంత కంటె తెలీదు. ఈమెపేరు రాణీ మీరు ఎవర్నిచూసి ఎవరనుకుంటున్నారో ?

స్త్రీ :- రాణీయా ! ఛీ ! ఛీ ! రాణీ నాకెందుకు,

రాణి :- మరెవరు కావాలోచెప్పు.

స్త్రీ :- అయితే రాధెక్కడ ?

రాణి :- వాళ్ళింట్లో ?

స్త్రీ :- అంతానాటకం. మీరె ఆమెనెక్కడో దాచేసుంటారు ?

సరోజ :- (నెమ్మదిగా),ఇదెక్కడి గొడవే. దీన్నెలాగో అలాగా పంపించెయ్యవే.

రాణి :- (నెమ్మదిగా) ఇది వొదిలేటట్టులేదు. (గట్టిగా) ఎక్కడాదాచలేదు. ఇక్కడికే వస్తుంది.

స్త్రీ :- రానీ దానిపని చూస్తాను.

సరోజ :- రాధిప్పుడే రాదిక్కడికి ?

స్త్రీ :- ఎప్పుడొస్తేనాకేం. అదొచ్చేవరకు ఇక్కడే ఉంటాను.

సరోజ :- ఇదిగో - అలా ఎంతసేపు నుంచుంటావు ? కాళ్ళునెప్పులు పుట్టాయి వచ్చికూర్చో.

రాణి :- (నెమ్మదిగా) బోడి మర్యాదలుకూడా ఈపిచ్చి మొహానికి,

స్త్రీ :- నేను కూర్చోడానికిరాలేదు. ఆదిరానీ దాని అంతం తేలుస్తాను.

రాణి :- అదివచ్చాక తెలుస్తుంది. నీఅంతు అదే తేలుస్తుందో ? దానిఅంతు నువ్వే తేలుస్తావో ?

స్త్రీ :- ఏమిటంటున్నావు ? నుంచున్న పణంగా తేల్చేస్తాను తెలిసిందా ?

రాణి :- అయ్యో తెలీకేం బాగాతెలుసు. అనవసరంగా ఆవేశం తెచ్చుకోకు. ఆయాస పడకు ఆరోగ్యానికి మంచిదికాదు. కాసేపు అలాకూర్చో,

స్త్రీ :- ఇదిగో కూర్చోవాలో నుంచోవాలో నాకు బాగాతెలుసు. నువ్వేం చెప్పక్కర్లేదు. (అంటూ నేలమీద చతికిలబడును.)

రాణి :- ఇదిగో అక్కడకాదు. ఇక్కడ కుర్చీలోకూర్చో.

స్త్రీ :- నేనెక్కడ కూర్చోవాలో నాకు బాగాతెలుసు. నేనిక్కడే కూర్చుంటాను.

రాణి :- నీయిష్ట మున్నచోట కూర్చో - మధ్య నాకెందుకు,

స్త్రీ :- ఏమిటే ఊరుకొన్నకొద్దీ మరీ రెచ్చిపోతున్నావు. మొదటినుంచి చూస్తున్నా నీవరస. నాకేంచెయ్యాలో బాగాతెలుసు. నువ్వు నోరుమూసుకో ?

సరోజ :- రాణీ ! ఏమిటే ఈగోలంతా ! కాసేపు నువ్వూరుకోవే.

(ఇంతలో రాధ ప్రవేశం)

స్త్రీ :- (లేచి నిలబడి) ఆ - ఆ - అదిగో - ఈ దెయ్యమే.

రాధ :- ఇదిగో ! దెయ్యం గియ్యం అంటున్నావు ? ఎవరనుకున్నావు.

స్త్రీ :- నువ్వెవరో నాకు బాగా తెలుసు ? నువ్వసలు ఆడదానివేనాఅంట.

రాధ :- (నెమ్మదిగా) ఈవిడెవరే,

రాణి :- (నెమ్మదిగా) ఎవరో ఎందుకొచ్చిందో ఎవరికీ తెలీదు. ఇందాకటినుంచి నానా గొడవచేస్తోంది, పేరు గంగమ్మట.

రాధ :- (నెమ్మదిగా) అయితే ఓపట్టు పట్టవలసిందే.
(గట్టిగా) చెట్టంత ఆడదాన్ని ఎదురుగా కనబడుతూంటె నీకనుమానం ఎందుకొచ్చిందీ ? అయినా గంగమ్మా ! కాస్త మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకో ఎందుకేనా మంచిది.

స్త్రీ :- అవ్వ ! అవ్వ ! నీకు మర్యాదటే, సిగ్గు బిడియం లేనిదానికి మర్యాద కావాలిట. మర్యాద.

రాధ :- ఇదిగో గంగమ్మా ! ఇష్టమొచ్చినట్లు మాట్లాడావంటె పిచ్చాసుపత్రికి పంపించేస్తాను - జాగ్రత్త.

స్త్రీ :- నాఇష్టమొచ్చినట్లు మాట్లాడుతానె నువ్వెవతివే పిచ్చాసుపత్రికి పంపించడానికి నిన్నే పంపించేస్తాను. తెలిసిందా ? సిగ్గు బిడియంలేకుండా నాకొడుకు రాజుని కొంగునకట్టుకు తిరుగుతున్నావు. పరాయి మగాడితో అలా తిరగడానికి నీకు సిగ్గులేదూ ? నీతల్లి తండ్రులు నీకు భయం చెప్పలేదూ ? మాట్లాడవేం ?

రాధ :- ఓహో ! ఇప్పుడర్థమయింది. తమరు రాజుతల్లి అన్నమాట. ఆ - ఆ - ఆ - (నవ్వు.) ఇదిగో గంగమ్మా ! మీఅబ్బాయిని నేను కొంగునికట్టుకుని తిరగడం లేదు. మీ అబ్బాయే నాకొంగుపట్టుకు తిరుగుతున్నాడు తెలిసిందా ?

సరోజ :- రాధా ! ఏమిటే ఇదంతా ? రాజెవడే ?

రాధ :- సరోజా ! అవన్నీ నీకెందుకు, కంగారుపడకు. అవన్నీ తర్వాత చెబుతాలె.

స్త్రీ :- ఆ - ఆ - ఏమంటున్నావు ? మాఅబ్బాయే నీకొంగుపట్టుకు తిరుగుతున్నాడా ? ఎంత నంగనాచివే ?

రాధ :- అవును నావెంటే పడుతున్నాడు. అంతేకాదు. "రాధా నువ్వులేందే నే బ్రతక లేను. నిన్నే ప్రేమిస్తున్నాను", అంటున్నాడు.

స్త్రీ :- ఆ - ఆ - ఎంత మాయలేడివేనువ్వు ? మా అబ్బాయేనిన్ను ప్రేమించాడా ? నువ్వులేందే బ్రతకలేనంటున్నాడా ? ఎంత జిత్తులమారినక్కవే ? నిన్ను నిన్ను ఏం చేస్తానో చూడు ?

రాధ :- ఇదిగో గయ్యాళి గంగమ్మా ? నువ్వు నన్ను ఏంచెయ్యలేవు. కానీ పాపం మీఅబ్బాయే అంతగా వెంటబడుతూంటే నాకు జాలేస్తోంది.

స్త్రీ :- ఆ - ఆ - నీకు జాలేమిటే ? ఇదిగో నీఆటలు నాదగ్గరకాదు. వాడిమనస్సు నాకు బాగాతెలుసు. వాడసలు నన్నొదిలి ఒక్కక్షణంకూడా ఉండలేడు. నామాటే వేదవాక్కువాడికి. అంత మంచివాడిని నువ్వే పాడుచేశావు ?

రాధ :- అయ్యో ! గంగమ్మా ! ఎంత అమాయకురాలివినువ్వు ? పాపం నీకొడుకు ఇంకా చిన్నపిల్లా డనుకుంటున్నావా ? ఇంట్లో పిల్లిలాగే ఉంటాడు ? వీధుల్లో పక్కారౌడే నీకొడుకు అత్తమ్మా !

స్త్రీ :- ఆ ? ఆ ! అత్తమ్మాఏమిటే ? అయ్యో ! అయ్యో అలా వరసలు కలిపేస్తున్నావేమిటే ? ఈమాటలా అన్నావంటె నిన్నేంచేస్తానో చూడు ?

రాధ :- అయ్యో ? వెర్రత్తమ్మా ! మొగుడు తల్లిని అత్తమ్మా అనక ఇంకే మన మన్నావు ?

స్త్రీ :- ఆ - ఆ - ఇదెక్కడి ఖర్మే. మొగుడేమిటే ? తల్లేవరే ? ఇదిగో నాకు కోప మొచ్చిందంటే ఏంచేస్తానో తెలుసా ?

రాధ :- చ్చు ! చ్చు ! ఇంకేంచేస్తావు ? పాపం అంతా అయిపోయింది గోయిందా ! గోయిందా - (నెత్తిని చేతులుపెట్టుకొని గిరగిరా తిరుగును).

రాణి :- ఇదేమిటేరాధా ! ఈగొడవంతా ఏమిటే ?

రాధ :- (నెమ్మదిగా) రాణీ నీకు తర్వాత చెబుతాకానీ - మీరేమి కంగారుపడకండి.

స్త్రీ :- ఇదిగో పిచ్చి పిచ్చి వేషాలువెయ్యకు. నాకు కోపమొచ్చేస్తోంది. నిన్నేం చేస్తానోచూడు. (మీది మీది కొచ్చును.)

రాధ :- ఇదిగో కాస్త దూరంగానుంచో ఎందుకైనమంచిది. ఒకవేళ నాచెయ్యిలేచిందో నీదవడమిగలదు. తర్వాత నీయిష్టం. అయినా ఇదిగో నేను మీ అబ్బాయిని చిక్కడపల్లి గుడిలో పెళ్ళిచేసుకున్నాను. ఇక యేం చేస్తావో చేసుకో ?

రాణి :- ఏమిటే ఇదంతా ? ఇదెక్కడి గొడవే ?

సరోజ :- రాధా ? ఇదేమిటే ?

రాధ :- (నెమ్మదిగా) ఆదంతే మీరు కాసేపు నోరుమూసుకుంటారా ? లేదా ?

స్త్రీ :- ఆ - ఆ - ఏమిటి ? మా అబ్బాయిని నువ్వు పెళ్ళిచేసుకోవడం ఏమిటే ? అయ్యో ? అయ్యో ! ఎంతపనిచేశావే ? అయ్యో రాజూ నీకేంగతిపట్టిందిరా ? (నెత్తిన చేతులుపెట్టుకుని చతికిలపడును).

(అంతలో పకిరింటి సుబ్బాయమ్మ ప్రవేశం)

సుబ్బా :- అయ్యో ! అయ్యో ! గంగమ్మా ! యేం జరిగిందేమిటి ?

గంగ :- ఇంకేం జరగాలిసుబ్బాయమా! యేం జరకూడదో అదేజరిగిపోయిందమ్మా!

సుబ్బా :- అదేమిటి గంగమ్మా ? అంత జరకూడనిది అదెలా జరిగిపోయిందమ్మా !

గంగ :- చెప్పడానికి నోరురావడంలేదంటేనమ్మా సుబ్బాయమ్మా ? ఇదిగో ! ఇదిగో ఈరాకాసి ! ఈ గడుగ్గాయి ! నాకొడుకుని మోసంచేసి పెళ్ళిచేసుకుంది, నాకొడుకుని నాక్కాకుండాచేసేసింది బాబోయ్.

సుబ్బా :- అయ్యో ! అలాగా గంగమ్మా ! వీళ్ళసలు ఆడపిల్లలేనా అని, అయ్యో ! అయ్యో ! నీకెంతకష్టం వచ్చిందమ్మోయ్.

గంగ :- (ఏడుపు కంఠంతో ముక్కు చీదుకుంటూ) ఇప్పుడేంచెయ్యను సుబ్బాయమ్మా! నా వెర్రితండ్రి ఈరాక్షసిపాలు పడ్డాడమ్మోయ్.

సుబ్బా :- అయ్యో ! అయ్యో ! అలా బాధపడకు గంగమ్మా ! వీళ్ళందరూఇంతే. ఈ ! ఈ ! అంటూ ఒకటేనవ్వులు, వేళాకాదు, పాడులేదు, ఒకటే వెక వెకలు వక వకలు. ఆడలేదు మగాలేదు, ఒకటేవాగుడు. ఈపక్కింట్లో ఉండలేక పోతున్నాననుకో.

గంగ :- అయ్యో ! అలాగా సుబ్బాయమ్మా ! (ఏడుపు గొంతుక) ఈ కోతులసంగతి నాకేంతెలుసు. ఇప్పుడేం చెయ్యాలమ్మో !

సుబ్బా :- ఇదుగో గంగమ్మా ? అన్నింటికి అలా బాధపడితేకాదు, ఏదైన మంచి ఉపాయం ఆలోచించాలి.

గంగ :- నాబుర్రేం పనిచెయ్యడంలేదు. నువ్వు ఏదో ఆలోచించిచెప్పు సుబ్బాయమ్మా!

సుబ్బా :- ఇదిగో గంగమ్మా! అదెంతసేపు చిటికెలో ఆలోచించి చెబుతాను. అసలిలాటి రౌడీల్ని నాలుగు తన్నించి జైల్లో కూర్చోబెట్టాలి. అప్పుడుకాని తిక్క తగ్గదు తెలిసిందా ? గంగమ్మా ?

రాధ :- ఏమండోయ్ సుబ్బాయమ్మగారూ! కాస్త నోటికి జలుబెక్కువగా ఉన్నట్లుంది. ఒదిలెయ్యమన్నారేమిటి ?

సుబ్బా :- ఆ - ఆ - ఎంత పొగరేనీకు. నేనేమన్నానని, ఉన్నమాటంటే ఉలుకెందుకో?

రాధ :- ఇదిగో సుబ్బాయమ్మా! ఉన్నమాటేమిటి ? నామొహంకేసి చూసిచెప్పు. లేకపోతే నిన్నేమి చేస్తానో చూడు.

(అంటూ మీది మీది కొచ్చును.)

సరోజ :- రాధా ! ఈగోలంతా ఏమిటే ? వాళ్ళతో నీకెందుకే.
(రాణి, సరోజకలసి రాధనుపట్టి ఆపుదురు).

గంగ :- బాగాచెప్పావు సుబ్బాయమ్మా! వీళ్ళని నిజంగాతన్నీ జైల్లో పెట్టవలసిందే ?

సుబ్బా :- అందుకే గంగమ్మా! నామాటవిని వెంటనే పోలీసురిపోర్టు ఇచ్చేసెయ్యి. ఇలాటి విషయాల్లో ఎంతమాత్రం ఆలస్యం చెయ్యకూడదు.

గంగ :- నువ్వు మంచిదానివి కనక చక్కటి సలహా ఇచ్చావమ్మా! నీఋణం ఈ జన్మలో తీర్చుకోలేనమ్మా! ఇప్పటికే ముసలిదాన్ని అయిపోయాను. వచ్చే జన్మలో తప్పకుండా నీఋణం తీర్చుకుంటానమ్మా!

రాధ :- సుబ్బాయమ్మగారూ ? మంచిసలహా ఇచ్చారుగానీ పోలీసులకు రిపోర్టు ఏమని ఇస్తారండీ ?

సుబ్బా :- ఏదో ఇచ్చుకుంటాం నీకెందుకు ?

రాధ :- అయ్యో సుబ్బాయమ్మా! మాఅత్తగారిసంగతి భర్తగారిసంగతి నాక్కాకపోతే ఇంకెవరిక్కావాలి ?

గంగ :- అయ్యో ? ఇదెక్కడిఖర్మే నీతో ! అత్తేమిటీ భర్తేమిటీ ? ఆమాటలు వినలేక పోతున్నానే, ఇదెక్కడ దాపురించింది బాబోయ్ ?

సుబ్బా :- గంగమ్మా ! బాధపడకు, ఇదిగో రాధ ! ఓ శూర్పణఖ ! మా అబ్బాయిని మోసంచేసి పెళ్ళి చేసుకుంది. ఈపెళ్ళి చెల్లడానికి వీల్లేదని ఇస్తా. అప్పుడు మీ అందరి రోగాలు చప్పగా కుదిరిపోతాయి.

రాధ :- ఇ - ఇ - ఇ - ఇ - (అంటూ ఒకటేనవ్వులు.)

సుబ్బా :- ఆ - ఆ - ఆ - ఇదిగో ఎందుకంత నవ్వులు. చేసిందిచాలక సిగ్గులేకపోతేసరి.

రాధ :- అయ్యో ? సుబ్బాయమ్మగారూ మీతెలివికి నవ్వకపోతే ఏడవమన్నారా చెప్పండి! మీ అబ్బాయికి మైనారిటీతీరింది, ఎవర్ని పెళ్ళిచేసుకున్నా చెలుతుంది. ఒకవేళ మీరు కేసుపెట్టారనుకోండి మీఅబ్బాయి వట్టి వెర్రిబాగులవాడని అందరికి తెలిసి పోతుంది.

గంగ :- తెలిస్తే తెలియని అలాటివి నేనేమి లెక్కచెయ్యను. నిజంగా మా చిట్టితండ్రి చాలా అమాయకుడు.

రాధ :- అయ్యో ! గొప్పకొడుకునే కన్నావు ? నోట్లో వేలుపెడితే కొరుకలేడు.

గంగ :- ఇదిగో ! నాకురావలసిన ఇరవై వేల రూపాయలకట్నం చెడగొట్టింది కాకుండా ఇంకాఏమిటే వాగుతున్నావు ?

రాధ :- అయ్యో వెర్రి అత్తమ్మా ? ఈ దద్దమ్మకి ఇరవైవేలకట్నం ఎవరిస్తారనుకుంటున్నావు ?

గంగ :- అయ్యో ఆమాత్రం నాకు తెలీదనుకుంటున్నావా ? ఎవరివ్వడమేమిటే కట్నం. కో అంటే కోటిమంది. అయినా ఇంటర్ చదివితే పదివేలు బి. ఎ చదివితే ఇరవై వేలు కాళ్ళుపట్టుకిస్తారు. నాకు రావలసిన కట్నం దొక్కచించి పుచ్చుకుంటాను.

రాధ :- అయ్యో ! తెలీకేం పాపం. మీ అబ్బాయిని ఇరవై వేలకి అమ్మేద్దామనుకుంటున్నావా ? అందుకే నేనుముందే కొనేశాను. ఇంక నీయిష్టమొచ్చినట్లు చేసుకో ?

గంగ :- ఆ - ఆ - అమ్మకమేమిటే ? మాటలుకాస్త జాగ్రత్తగారాని, నువ్వు కొనడ

మేమిటే ? ఇదిగో నాక్కోపం వచ్చిందంటే నీమెళ్ళోపుస్తెలు తెంపేసి మరీ వెడతాను, నేనెవర్నను కుంటున్నావో ?

రాధ :- ఆ - ఆ - ఆ (నవ్వు) అయ్యో ! వెర్రి అత్తమ్మా ? మంగళసూత్రాలు మీ అబ్బాయి నాకట్టలేదు. నేనే మీ అబ్బాయికి కట్టేశాను తెలిసిందా ?

రాణి :- ఇదేమిటే రాధా !

సరోజ :- రాధా ! నీకేమయిందే యీవేళ.

రాధ :- నాకేమికాలేదు: మీరు కాసేపు ఊరుకుంటారా ?

గంగ :- ఆ - ఆ - మా అబ్బాయికి పుస్తెలు కట్టడమేమిటి ? నువ్వుకడితే వాడెలా కట్టించుకున్నాడే ?

రాధ :- ఎలా కట్టించుకోడం ఏమిటి గంగమ్మా ! నీకొడుకు ఉత్త వెర్రిబాగులవాడని నువ్వేచెప్పావుగా ! అందుకే ఈసారివెళ్ళి పోలీసులతో చెప్పుకో.

గంగ :- ఇదెక్కడి పిల్లబాబోయ్. నాకు మతిపోగొట్టేస్తోంది. నాప్రాణానికెక్కడ దాపురించిందిరోయ్ బాబోయ్.

సుబ్బా :- అలా బాధపడకు, గంగమ్మా ! దీనిసంగతి మనంచూద్దాం ఇదిగో అబ్బాయికి బలవంతంగా తాళి కట్టేసిందని ఇచ్చేద్దాం రిపోర్టునడు గంగమ్మా ?

గంగ :- నిజమే సుబ్బాయమ్మా ! మంచిమాటచెప్పావు. వచ్చేజన్మలో నీఋణం తప్పకుండా తీర్చేసుకుంటానమ్మా !

రాధ, రాణి, సరోజ :- ఆ - ఆ - ఆ - (నవ్వు) వెళ్ళిరండి, శీఘ్రంగా వెళ్ళిరండి.

గంగ :- ఏం ? వెళ్ళక ఇక్కడే కూర్చుంటాననుకున్నావా ? రా ! సుబ్బాయమ్మా ! వాళ్ళతో మనకేమిటి ? పోదాంరా !

సుబ్బా :- సిగ్గు బిడియం పోయాక అంతే నడుపోదాం.

(ఇద్దరు వెళ్ళుదురు)

(రాణి, సరోజ చెమటలు తుడుచుకొందురు)

రాధ :- హమ్మయ్య కదిలింది దెయ్యం.

రాణి :- రాధా ! అంత రాక్షసినోరు బాగానె కట్టించావే ?

సరోజ :- అది సరేకాని నువ్వు రాజుని పెళ్ళిచేసుకోవడం ఏమిటి ?

రాధ :- (నవ్వు) ఆ - ఆ - ఆ - ఆ -

రాణి :- అదేం నవ్వే ? వెర్రినవ్వు ?

సరోజ- ఇదిగో రాధా ! ఆ వెర్రినవ్వు మానేసి అసలుసంగతి చెప్పవే ?

రాధ :- ఆ - ఆ - ఆ - ఆ - (నవ్వు).

రాణి :- రాధా ! ఆనవ్వు మానెసి అసలుసంగతి చెప్తావా ? లేదా ?

రాధ :- ఆ - ఆ - ఆ - (నవ్వు) అయ్యో ? నవ్వక ఏడవమనవే ? మీరేమి కంగారు పడకండి పెళ్ళికాదు గిళ్ళికాదు. ఆ గంగమ్మని ఏడిపించాలని అలా అన్నానంతే.

సరోజ :- ఆ - ఆ - అంతేనా ? హడలు గొట్టేశావుకదే ?

రాణి :- ఇంతకీ రాజెవరే ?

రాధ :- ఎవరేమిటే ? రాజుని అప్పుడే మర్చిపొయారా ! బి. ఎ లో నాక్లాసు మేటు.

సరోజ :- ఓ ! హో ! అతనా ?

రాణి :- నీకెక్కడ కలిశాడే ?

రాధ :- పొద్దుట చాలా సేపు బస్సుస్టాండులో నిలబడ్డా. అప్పటికి బస్సు రాలేదు. ఇంతలో రాజు స్కూటరెక్కివస్తూ నన్ను చూసి ఆపాడు. మీ కభ్యంతరం లేకపోతే ఆఫీసు దగ్గర డ్రాప్‌చేస్తానన్నాడు. సరే అని ఒప్పుకున్నాను. అది చూసి ఎవర్నో వివరాలు అడిగి ఇక్కడికి బయలుదేరినట్టుంది. గయ్యాళి గంగమ్మ.

రాణి :- అనుమానపు పక్షి. (లేచి నిలబడి ఎగురుతూ చప్పట్లు వాడుతూ) భలేగా ఏడిపించావు లేవే ? మంచిపని చేశావు ?

సరోజ :- రాధా! నువ్వుచాలా తొందరపడ్డావనిపిస్తోంది; రాజుకుతెలిస్తే ఏమను కుంటాడో ఆలోచించావా? ఇక్కడ ఇంతల్లరిచేసిన ఈవిడ ఇంటికెళ్ళి రాజుని ఎన్ని తిడుతుందో? అనవసరంగా అతన్ని ఇరుకులోపెట్టేవుకదే?

రాధ ;- సరోజా! నీకన్నీ అనుమానాలు భయాలూను.

సరోజ ;- నాకనుమానంకాదు రాధా! నీకు రోజురోజుకి పెంకితనం ముదిరిపోతోందే, వేళాకోళానికీ హద్దుండాలి. నువ్విలా చెయ్యడం ఏంబాగుండలేదు? అయినా ఇంటికొచ్చింది కనక సరిపడింది, ఇంకానయం ఆఫీసుకొచ్చింది కాదు,

రాణి ;- ఏం? ఆఫీసుకొస్తేభయమా? ఆయినా! సరోజా నీలా మునలమ్మ కబుర్లు చెబితే ఈ రోజుల్లో లాభం లేదే? దేనికైనా సాహసముండాలి? ఆ గంగమ్మని అలా యేడిపించవలసిందే?

రాధ :- ఇదిగో ఫ్రెండ్సు ఇంకాటాపికులా ఆపేయండి హాయిగా సినిమాకు పోదాం తెమలండి .

రాణి ;- సరే ఆలాగేపోదాం. వాళ్ళతో వాదించలేక అలసిపోయాం.

సరోజ :- నువ్వేం వాదించావే పెద్ద

రాధ ;- ఇంతకీ సరోజా పిక్చరికి బయలుదేరుతున్నావా? లేదా?

సరోజ :- నీ ఆజ్ఞ అలాగే బయలుదేరుతున్నానే తల్లీ.

రాధ :- సరే అయితే నేను ఒక్కసారి మాయింటికెళ్ళి బట్టలు మార్చుకొని ఇప్పుడే వచ్చేస్తాను.

రాణి :- సరేమహాతల్లి త్వరగా దయచెయ్యి. నువ్వుముస్తాబు చేసుకోవడం మొదలు పెడితే తెల్లవారవలసిందే?

రాధ :- ఏం భయపడకండి. చిటికిలో వచ్చేస్తాను.

(రాధ వెళ్ళును)

సరోజ:- ఇంత చక్కటి సాయంకాలం ఇలా అయిందేమే రాణీ. ఈ వేళలేచి ఎవరి మొహం చూశామో కాని లేనిపోని గొడవలొచ్చి పడ్డాయి. ఈ గంగమ్మ ప్రత్యక్షమై మనప్రాణం తీసిందికదే. నిజంగా హడలి చచ్చాననుకో.

రాణి :- ఈ గంగమ్మ అవతారానికేంకాని పక్కింటి పిన్నిగార్ని చూశావా? లోపలున్న కుళ్ళంతా వెళ్ళగక్కింది ఆవిడకి బాగా బుద్ధి చెప్పాలి.

సరోజ :- ఆవిడకి బుద్ధి చెప్పేముందు మనం కాస్త బుద్ధితెచ్చుకోడం చాలా అవసరం. అన్నిటికంటె ముందుకాస్త ఆలోచించి మాట్లాడ్డం అలవాటు చేసుకోవాలి. ఈ గొడవ ఇంతటితో పూర్తయితే అంతేచాలు.

(ఇంతలో రాధ ఆయాసపడుతూ ప్రవేశం)

సరోజ :- అదేమిటి రాధా! అంత కంగారు పడుతున్నావు? ఏమయిందే?

రాణి :- మళ్ళీ యేం గొడవ తెచ్చుకొచ్చావే?

రాధ :- కంగారుకేంకాని కథ అడ్డం తిరిగిందే (కాస్తనీరసంగా)

రాణి :- అడ్డం తిరిగిందీ! నేనప్పుడే అనుకున్నానే ఇదేదో బెడిసి కొడుతుందనీ?

సరోజ :- నువ్వూరుకోరాణి దాన్ని చెప్పనియ్యి.

రాణి :- అదేం సస్పెన్సే. త్వరగాచెప్పి మమ్మల్ని కృతార్థుల్ని చెయ్యవే.

సరోజ :- రాణీ నీకెన్నిసార్లు చెప్పాలే. దాన్ని కంగారుపెట్టకే,

రాణి :- అలాగె కంగారుపెట్టను కాని అదేదో కాస్తత్వరగా చెప్పిఏడవమను

సరోజ :- ఊ చెప్పవే రాధా!

రాధ :- ఆరాజు మళ్ళీ ఎదురుపడ్డాడే?

రాణి :- ఎదురుపడితే నీకేమే.

సరోజ :- ఎదురుపడి ఏం చేశాడే?

రాధ :- ఏం చెయ్యడమేమిటే? 'ఏం రాధగారూ నన్నెందుకిలా యేడిపిస్తారు? నేను మీకేమన్యాయం చేశాను' అన్నాడు.

రాణి :- అచ్చు సినీ హీరోలా అన్నాడన్నమాట.

సరోజ :- నువ్వుకాస్త నోరుమూసుకుంటావా లేదా? ఇంకా ఏమన్నాడే రాధా,

రాణి :- (చేత్తో నోరుమూసుకొనును).

రాధ :- "రాధ గారూ! మా అమ్మచేత నానా చివాట్లు పెట్టించి నలుగురిలో తలెత్తుకోకుండా చేశారు" అన్నాడు,

రాణి :- ఆ— ఆ— అంతమాట అనేశాడూ.

సరోజ :- నువ్వేమన్నావే?

రాధ :- అనడానికేముంది. "నేనేం చేశానని మీ అమ్మనే అడుగు" అన్నాను.

సరోజ :- అతనేమన్నాడే ?

రాధ :- ఇంకేమంటాడు? ఏం చెయ్యాలో అదేచేశారు నిజంగా నేనిప్పుడు మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీ రొప్పుకుంటే మనిద్దరం పెళ్ళిచేసుకుందాం అన్నాడు.

రాణి :- అంతమాట అనేశాడే "మిమ్మల్ని ప్రేమించాను" అన్నాడు గోయిందా! గోయింద.

సరోజ :- నువ్వేమన్నావే?

రాణి :- ఇంకేమంటుంది. నిన్నే ప్రేమిస్తున్నాను. అని అనివుంటుంది.

రాధ :- అలా అనలేదే మహారాణీ. నేను మిమ్మల్ని ప్రేమించలేను అన్నాను,

రాణి :- తెలుగు సినిమా హీరోయిన్‌లా చెప్పేసావన్నమాట శభాష్,

సరోజ :- రాణీ! నీకన్నీ వేళాకోళాలేనే. రాధా నువ్వుచెప్పవే?

రాధ :- "ఇంత అవమానం జరిగాక మీరు పెళ్ళిచేసుకోకపోతే చచ్చిపోతాను" అన్నాడు.

రాణి :- చావమనకపోయావే?

రాధ :- అలాగె అనేశానే,

రాణి :- మరింకెందుకే బాధ.

రాధ :- నాకెందుకే బాధ.

సరోజ :- రాధా! నువ్వుచాలా తొందరపడ్డావనిపిస్తోంది. నిజంగా రాజు ఏదైన మింగితే ఇప్పుడేం చేస్తావే.

రాణి :- ఆ—ఆ ఆమాత్రందానికి చచ్చిపోతే రాజువట్టి పిరికి పందన్నమాట! అయినా ఏ సినిమాహీరో అలా చచ్చిపోయినట్టు లేదే?

సరోజ :- రాధా! అన్నిచోట్లా అంతమొండితనం పనికిరాదే ఆలోచించి మళ్ళిచెబుతాను రాజు అని చెప్పిరావలసింది.

రాణి :- అలా అందనుకో "ప్రియా—ప్రియా ఆలోచించావా?" అంటూ రోజూ వెంట పడతాడు. తెలిసిందా?

రాధ :- నోరుమూసుకో అంటాను తెలిసిందా?

సరోజ :- రాధా! చాలా తొందరపడ్డావు. నిజంగా ఇదెదో మళ్ళిగొడవ తెచ్చిపెట్టే టట్టే కనబడుతోంది.

(ఇంతలో గంగమ్మ–సుబ్బాయమ్మా ప్రవేశం)

గంగ ;- అమ్మా! సరోజా! నువ్వే నా కొడుకుని కాపాడాలమ్మా నువ్వే నన్ను రక్షించాలమ్మా! (గుండెలు బాదుకుంటూ ఏడుపు)

సరోజ ;- అసలేంజరిగిందో చెప్పకుండా ఏడిస్తే ఎలాగండి,

సుబ్బ ;- ఇంకా ఏం జరగాలమ్మా! ఏం జరక్కూడదో అదే జరిగిపోయిందమ్మా!

(గంగమ్మ ఏడుపు)

రాణి ;- అదేమిటో చెప్పి మరీ దీర్ఘాలు తియ్యండి,

సరోజ :- రాణీ కాసేపు నువ్వూరుకో గంగమ్మగారు ఏం జరిగిందో త్వరగా చెప్పండి,

గంగ ;- ఇదంతా నేచేసిందేనమ్మా! నానోరు పడిపోను. నాచేతులు పడిపోనూ నన్ను దేముడెత్తుకెళ్ళ. (అంటూ ఏడుపు)

సుబ్బ ,- అయ్యో! అలా బాధపడకు గంగమ్మా! నిన్ను చూస్తుంటే నా గుండె తరుక్కుపోతుంది. ఏది ఎలాజరగాలో అలాజరుగుతుందమ్మా! మనం నిమిత్త మాత్రులం. ఊరుకో గంగమ్మా! ఊరుకో

రాణి ;- ఇంతకీ ఏం జరిగిందో చెబుతారా? ఇక్కడనుంచి వెడతారా?

గంగ ;- ఏం చెప్పనమ్మా! నానోరు రావడంలేదంటేనమ్మ,

సరోజ ;- సుబ్బాయమ్మగారూ మమ్మల్ని చంపక మీరైనా చెబుతారా? లేదా?

సుబ్బ :- నే నేం చెప్పనమ్మా! చెప్పాలంటే నోరు పెగలడం లేదనుకో?

సరోజ :- గంగమ్మగారూ? మీరేనా చెప్పిమరీ ఏడవండీ.

రాణి ;-కాసేపు రాగం ఆపిమరీ చెప్పండి. కావలసివస్తే నేనుకూడా మీతో రాగం తీస్తాను.

సరోజ ;- నువ్వూరుకోరాణి చెప్పండి గంగమ్మగారూ.

గంగ :- (ఏడుపు గొంతుతో) ఏం చెప్పమంటావమ్మా ఇక్కడనుంచి వెళ్ళి తిన్నగా ఉంచక నాకొడుకు రాజును నానామాటలు తిట్టానమ్మా. వాడేదో చెబుతూంటే నా చెవులకి తాళాలు పెట్టేశానమ్మా. వాడు చచ్చిపోతావంటూ ఏవో మందులు మింగేశాడమ్మా. హాస్పటల్‌కి రమ్మంటే రానంటున్నాడమ్మా. నువ్వేలాగైనా రక్షించాలమ్మా!

సరోజ :- విషం మింగుతూంటే చూస్తూ ఎలా ఊరుకున్నారండీ!

గంగ :- ఎంతచెప్పినా వినకుండా గుటుక్కున మింగేశాడమ్మా! నువ్వే వాడని కాపాడాలమ్మా నేను చచ్చిపోయాక నా చెర్మం వొలిపించి నీకు చెప్పులు కుట్టిస్తానమ్మా!

సరోజ :- ఇంకిప్పుడేడిస్తే ఏంలాభమండీ. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. మీరు వెంటనేవెళ్ళి రాజుని ఇక్కడకు తీసుకురండి. విషం ఒళ్ళంతా ఎక్కిందంటే చాలా ప్రమాదం వెంటనే తీసుకురండి.

గంగ :- వాడు నామాట వినిపించుకోడమ్మా! నన్నిలాగె చావనీండి అంటూ ఆరుస్తున్నాడమ్మా!

సరోజ :- రాధా, నువ్వు రాణీ వాళ్ళతోవెళ్ళి ఏదో విధంగా ముందు రాజుకి నచ్చచెప్పి ఇక్కడకు తీసుకురండి బయలుదేరండి.

రాధ, రాణి :- మాకేంపని మేం వెళ్ళం.

సరోజ :- మీకంత మొండితనం పనికిరాదే. నిష్కారణంగా చచ్చిపోతాడే మీరు వెళ్ళండే.

రాధ, రాణి :- చస్తే మాకే, బ్రతికితే మాకేం. మేం వెళ్ళం మాకవసరంలేదు.

సరోజ :– రాధా ! నువ్వేన వెళ్ళవే ?

రాణి :– ఆ-ఇంకెందుకే వెళ్ళడం ఈ పాటికి గోయిందా అయ్యేఉంటాడు.

సరోజ :- రాణి ! ఇంతజరిగినా నీవాగుడు తగ్గలేదే ?

రాణి :- ఇంతకీ నే నేంచేశానె. రాజుని చావమని నేనుచెప్పానా ?

గంగ :- అమ్మా రాధమ్మ ? రాణి తల్లీ నాతప్పులు క్షమించండమ్మ ? నాకొడుకుని రక్షించండమ్మ ! మీ రొస్తేనాకొడుకు వింటాడమ్మా !

(ముక్కు తుడుచుకుంటుంది.)

రాణి :– ఆయేడుపు ముందే ఏడవకపోయావా గంగమ్మ ! ఇంత ప్రమాదం జరిగేది కాదు.

గంగ :- ఇప్పటికిబుద్ధొచ్చిందమ్మా ! త్వరగారండి. నాబిడ్డఎంతబాధపడిపోతున్నాడేదో ఏమో ?

సరోజ ;- వెళ్ళండే

రాధా, రాణి ;- సరే-ఏమిచేస్తాం

(అందరూ వెళ్ళుదురు.)

సరోజ :- (తలపట్టుకొని కుర్చీలో కూర్చుని) ఇదెక్కడిగొడవో ఈవేళ తలబద్దలై పోతోంది. ఈ రాధా, రాణి మరీ పెంకివాళ్ళై పోతున్నారు. (కుర్చీలోంచి లేచి అటూ ఇటూ తిరుగుతూ) ఇప్పుడే రాజుకి ఏదైన ప్రమాదంజరిగితే రాధగతి ఏమవుతుందో, అసలీగంగమ్మ బ్రతకనియ్యదు. చెబుతుంటె వినిపించలేదు నా శాయశక్తులా ప్రయత్నించి అతన్ని బ్రతికించాలి. ఇంతలో రాజుని నడిపించుకుంటూ గంగమ్మ సుబ్బాయమ్మా వస్తారు. కూడా రాధా, రాణి ఉంటారు రాజు ఆయాస పడుతూ వుంటాడు.)
ఇదిగో ఇలాతీసుకురండి. ఈ బెడ్ మీదపడుకో పెట్టండి.

(ఒక బల్లమీద పడుకోబెడతారు సెతస్టోప్‌తో పరీక్షచేసి మందు గ్లాసులో పోస్తుంది.)

సరోజ ;- రాజు ఇదిగో ఈమందు వెంటనేతాగాలి,

రాజు :- (ఆయసపడుతూ) నాకవసరము లేదు. నన్నిలాచావనీయండి. నే నేమందు తాగను

సరోజ ;— రా జూ! అలా అంటే కాదు. నువ్వీమందు తాగవలసిందే

రాజు :- నే నేమందు తాగను అయినా నే నెవరికోసంతాగలి ఎవరికోసం బ్రతకాలి ?

సరోజ :- ఎవరికోసంఎమిటి ? నీకోసంనువ్వు బ్రతకాలి మీ అమ్మకోసం బ్రతకాలి. మాఅందరికోసం బ్రతకాలి.

రాజు :- నాకు బ్రతకాలని లేదు. నాకెవ్వరూ లేరు నన్నిలా చావనీయండి నాకింతే చాలు.

గంగ :- (గుండెలు బాదుకుంటూ) అమ్మా! డాక్టరమ్మా! నాకొడుకుని ఎలాగైన బ్రతికించాలమ్మా! పెళ్ళియిందో లేదో ఎంతఘోరం జరిగిందో చూస్తున్నావా అమ్మా! నిన్నే నమ్ముకున్నానమ్మ !

(లెంపలేసుకుంటూ) నానోరుపడి పోను, నాచెయ్యి పడిపోను ఇంకెప్పుడూ వాడి నేమి అననమ్మా! వాడిష్ట మొచ్చినట్లు ఉండ నిస్తానమ్మా!

రాజు ;- (అటు తల తిప్పు కోమను బాగా ఆయాసపడుతుంటాడు)

సరోజ :— మీరుకాసేపు అల్లరిచేయకండి మీతొందరబాటు ఎంత ప్రమాదాన్ని తెచ్చి పెట్టిందోచూశారా ?

గంగ ;— అందుకే లెంపలేసుకుంటున్నానమ్మా ఇదిగోడాక్టరమ్మా! చూ శా వా ? నాకొడుకు ఎలా ఆయాసపడుతున్నాడో చూశావా ? రక్షించమ్మా! నేను చూడ లేకపోతున్నానమ్మా !

సరోజ ;— రాజా ! చూశావా ? మీ అమ్మగారు ఏమంటు న్నారో ? ఇంక మందు తాగు

రాజు ; నేతాగను నే నెవరికోసం బ్రతకాలి డాక్టర్. నన్ను బ్రతికించటానికి ప్రయత్నంచేయకండి.

సరోజ :— ఒసే రాధా ! ఇంకపట్టింపులెందుకే ? ఇలావచ్చి రాజునిక్షమాపణ వేడుకోవె ?

రాణి ;- వెళ్ళవేరాధా ! నిష్కారణంగా చచ్చిపోతాడె ఆపాపం నీకు చుట్టుకుంటుందే,

సరోజ ;— ఒసే రాధా అలా మొద్దులా నుంచుంటావేమిటి ఒప్పుకుంటాననవే ?

రాణి ;— ఒసే రాధా ! ఒకమూల చచ్చిపోతూంటె ఇంకా పంతాలు యెందుకే. ఒప్పుకుంటానను ఆమాటలువిని ప్రాణం దానంతటదేసుఖంగా పోతుంది. నీమీద మనస్సుతో గిల గిలాకొట్టుకుంటోందె

సరోజ ;- రాణి ! కాసేపు నీ నోటికితాళంపెడతావా ?

రాణి !- అలాగేతప్పకుండా తాళంపెడతా కాని చూడవే రాధా ! చూడు అవిగోకళ్ళలా మూతలుపడిపోతున్నాయో ఇంకొక్క క్షణంలో గుండె బహుశాకొట్టు కోడం మానేస్తుంది. అందుకే రాధ చావుకోరిక తీర్చేసెయ్యి లేకపోతే భూతమై నీచుట్టూ తిరుగుతుంది.

(రాజు ఇంకా కొంచెం ఆయాసపడుతూ ఉంటాడు.)

గంగ ;— అలా అనకమ్మా నీకాళ్ళు పట్టుకుంటాను నాకొడుకు బ్రతకాలమ్మ ! అమ్మా డాక్టరమ్మా ! రక్షించు.

సుబ్బా ;— డాక్టరమ్మా ! త్వరగా మందుతాగించేశయమ్మ !

సరోజ ;- రాదా నువ్విటొచ్చి ఒప్పుకోవే !

రాధ ;- ( కాస్త భయంతో సిగ్గుతో ) రాజూ ! నన్నుక్షమించు నీమాటఒప్పుకుంటాను,

సరోజ ;- రాజా ! ఇదిగోమందుతాగనంటే బలవంతంగా తాగించి ఇదిగో ఇన్ని ఇంజక్షన్స్ చెయ్యవలసివస్తుంది, తెలిసిందా !

(మెల్లిగా నవ్వును)

రాజు :- (గబుక్కున లేచి కూర్చొని) బాబోయ్ నే నేవిషంతాగ లేదు. స్వీటు బిళ్ళలు తిన్ననంతే.

గంగ :- ఆ— ఆ— ఏమిట్రా నువ్వంటున్నది· ఇదంతా నిజమేనా. విషపుగోలీలు మింగనేలేదా? అంత భయపెట్టావే వెందుకురా? ఏం డాక్టరమ్మా నిజమేనా·

రాజు :- నువ్వూ, రాధా పెళ్ళికి ఒప్పుకోరని.

సరోజ :- అంతే గంగమ్మగారు ఏమీ మింగలేదు అంతా నాటకం.

రాధ :- సరోజా ఏమిటిదంతా. (రాధ సిగ్గుతో పక్కకు తప్పుకుంటూ) నిన్నేం చేస్తానో చూడు సరోజా.

రాణి :- బలేగా చేశావుసరోజా రాధతిక్క కుదిరిందీదెబ్బతో.

గంగ :- ఇంకా పెళ్ళెవరికిరా·

సరోజ :- రాధకి మీ అబ్బాయికీ ఇంకా పెళ్ళికాలేదండి.

గంగ :- ఆ— ఆ— ఎంతభయపెట్టైశారర్రా. నాగుండె ఆగి మళ్ళీ కొట్టుకుందను కోండి.

సుబ్బ :- నేను మొదటినుంచి అనుకుంటూనే వున్నా ఈ పిల్ల సింసింగ్రీ అని.

రాణి :- సుబ్బాయమ్మగారూ మీరుకాస్త నోరు...........

సుబ్బా ; సరేలే మధ్య నాకెందుకు. ఆ గంగమ్మే వేగుతుంది ఈ రాకాసి కోడలుతో.

గంగ :- ఎంతపని చేశెవ్వురా రాజు ఆ మాత్రందానికి ఇంతభయపెట్టడం దేనికిరా! నీకు పెళ్ళంటే నాకుమాత్రం ఇష్టం కాదురా! ఏదో పెద్దదాన్ని నిన్ను జాగ్రత్తగా చూసుకోవాలని అలా అన్నాను.

రాజు :- నన్ను క్షమించమ్మా!

గంగ :- రాధమ్మా! నాకొడుకుని నానామాటలు అన్నాను కదమ్మా! నీకేమి బోలెడు చదువుకున్నదానివి అన్నీ తెలుసున్నదానివి. ఇదిగో యిప్పటినుంచి నా కొడుకుభారం మీ మీదపెడుతున్నా వాడుత్తమాయకుడమ్మా!

రాణి :- మీ రాజేం అమాయకుడు కాదండోయ్. మామోండి రాధనే మార్చేశాడు.

(అందరూ నవ్వుదురు)

గంగ :- ఏంచేస్తాం డాక్టరమ్మా మాతరం మారిపోయింది వాళ్ళేమిచేస్తే దానికి సంతోషించాలి, ఇంక హాయిగా తీర్థ యాత్రలకుపోతా. ఏమంటావు సుబ్బాయమ్మా.

సుబ్బ :- అంతే గంగమ్మా అంతే ఏంచేస్తాం తరం మారిపోయింది.

సమాప్తం

